

# Buddhisagara Vijayam :: ::

(Triumph of Buddhisagara)



AN ORIGINAL DRAMA
IN FIVE ACTS :: ::



BY

P. V. SUBBA RAO,

*Author of*
*Suvarnamukhi, Gangabayi,*
*Thribhuvanamu,*
*Chitra Bharatam and*
*Duryodhana Parabhavam.*



FIRST EDITION.



PRINTED AT THE
VANI PRESS, BEZWADA.

1923





PRICE: AS. 12.

శ్రీ

# బుద్ధిసాగర విజయము.

(ఐదంకముల నాటకము)



ఇయ్యది

సువర్ణముఖి, గంగాబాయి, త్రిభువనము, చిత్రభారతము, దుర్యోధనపరాభవముల

గ్రంథకర్తయగు

## పల్లె వేంకటసుబ్బారావుచే

రచియింపఁబడి

---


బెజవాడ వాణీ ముద్రాక్షరశాలయందు

డి. కే. పంత్ చే ముద్రింపఁబడి

"పి. వి. రమణయ్య అండు సన్, గుంటూరు" చేఁ

ప్రకటింపఁబడియె.

మొదటికూర్పు: 1000 ప్రతులు.





1923 [వెల: 0-12-0

# విజ్ఞప్తి

మత్కృతవచనగ్రంథములతో పాటు నా ప్రథమప్రయత్నంబగు "సుయోధనపరాభవ" నాటకమును దమరు సాదరభావంబున గ్రహింపవలసినదని నూత్నకృతిని బ్రచురింప సాహసించితి.

ఇందలి గుణలేశమును గ్రహించి, లోపములను క్షమింపం బ్రార్థితులు. నా నాటకమునకు విపులమగు భూమికను వ్రాసియిచ్చిన 'రోషనారా' గ్రంథకర్తలగు మహారాజశ్రీ కొప్పరపు సుబ్బారావు పంతులు గారికిఁ గృతజ్ఞతాపూర్వక వందనము లొనరించుచున్నాఁడ.

దైవకృపావిశేషముచేతను, పెద్దల యాశీర్వచనప్రభావముచేతను మత్పూర్వకృతుల పగిది యిదియు జనానురంజకం బగుఁ గాత!

ఇందలి ముద్రణాదిస్ఖాలిత్యములు రెండవ కూర్పున సవరించుకొందును.

గుంటూరు,
16–7–1923.

ఇట్లు, విధేయుఁడు
వల్ల వేంకటసుబ్బారావు.

# అవతారిక.

నటరంగము జనసామాన్యమునకు బాలశాలవంటిది. ప్రత్యక్షముగ నందు ప్రదర్శింపఁబడు భావాభినయములు ప్రేక్షకుల హృదయఫలకముల ముద్రితములై యావజ్జీవము నుత్సన్నములుగావు. హరిశ్చంద్రుని కష్టములను బొత్తంబునఁ జదివియు మనకు విచారము కలుగక పోవచ్చును; కథకులవలన వినియు మనకుఁ గరుణము గలుగక పోవచ్చును; కాని ప్రత్యక్ష ప్రదర్శనమునం దొక్కసారియైనఁ జూచినచో కట్టికర్కశమానసమైనను ద్రవింపకమానదు. కావున నే నాటకములు కావ్యశ్రేష్ఠములని పండితవర్యులు నిర్వచించిరి.

మానవునికి రెండే యనుభవములు: కష్టము, సుఖము. కాన మానవహృదయ ప్రకటనైకలక్ష్యములైన నాటకములుగూడ కష్టాంతములనియు, సుఖాంతములనియు రెండు ముఖ్యభాగములుగా విభజింపఁబడియె. కాని, ఏమానవుడును కష్టైక జీవి కాడు, సుఖైక జీవియునుగాఁడు. మానవుని బ్రదుకు కష్టసుఖసమ్మిళితము. అట్లయ్యుఁ గష్టాంతనాటకములు మాత్రము మన లాక్షణికులచే నిషేధింపఁబడియె. ఇది ప్రకృతివిరుద్ధమగునా కాదా యను క్లిష్టవితర్కమునకు-మాయెడల దయ చేఁగాఁబోలు-బుద్ధిసాగరవిజయ నాటకము చోటీయకున్నది.

ఏమన నిదిసుఖాంతమైన రూపకము. దీని నొకించుక విమర్శించుదము.

నాటకమునకు కథ ప్రాణము. కథారహితమై, కేవల ప్రకృతివర్ణనాపటిష్ఠములైనవి యేవియైనఁ గావచ్చుఁగాని నాటకములు మాత్రము కావు. ప్రతికథకును బీజమైన హేతు వేదో యొకటియుండును. ఆ హేతువున కేదో యొక ఫలితముండును. ఆ హేతుఫలితములను మనోరంజకముగా సంఘటించుటయే కథావిధాన (plot) మగును.

మన లాక్షణికు లీకథావిధానము నైదుభాగములుగా శాసించిరి. "ముఖం ప్రతిముఖం గర్భోవిమర్శశ్చ తథైవచ-నిర్వహణంచేతి నాటకేపంచసంధయః" అని దశరూపకము. ఈపంచసంధులచే బంధితమైన కథ నాటయితవ్యమని వారు ప్రవచించిరి.

బుద్ధిసాగరవిజయమునం దీవిధానము సమంజసముగా సంఘటింపఁబడుటచేతనే, తత్కథ నిరుపమానలాలిత్యము నొందినదని నిస్సంశయముగాఁ జెప్పనగు. వివరించుదము.

బుద్ధిసాగరుని సుదర్శన చిత్రరేఖా వివాహోద్యమమే కథయందలి ప్రధానాంశము. ఇది నాటకశరీరమున ముఖసంధి. అతనియెడ నీర్ష్యచే దమనుఁ డేతదుద్యమమునకు విఘాతము సంకల్పించుకొని రాజున కాతనియెడ నగౌరవభావమును గల్గించుటయే కథయందలి ప్రత్యుద్యమము. ఇది నాటకశరీరమునఁ బ్రతిముఖ సంధియయ్యెను.

దమనుఁడు సుదర్శనుని చెవిని విసముతో నించెను. సుదర్శనుఁడు బుద్ధిసాగరుని యెడలఁ దామసియయ్యెను. ఇది పిడుగువంటి వార్త! దీనికితోడు మఱొకటి. ఏకన్నియను దాను తనయొడయునికి పెండిలిసేయు పొంటె తోడ్కొని వచ్చెనో, యామెయాయొడయని నిరాకరించుటేగాక తన (బుద్ధిసాగరుని) పుత్రునే మోహించెను! దమనుని ద్వేష గీతమున కిది తాళమువలె బరిణమించె! కథ యిచట వడ్డముగాఁ దిరిగినది! ఇది నాటకశరీరమున గర్భసంధి.

దమన పిశాచావిష్టుఁడైన రాజు బుద్ధిసాగరుని కారాగారమున నిర్బంధించెను. తమ కుఁగూడ నేమికీడు రానున్నదోయని మదనచిత్రరేఖ లటవికిఁబలాయితులైరి. దమనుఁడు వారినిఁగూడ బట్టుకొనివచ్చెదనని కాననమున కేగెను. అతని కచట జిత్రరేఖకు మారు శశిరేఖ గన్పించెను. ఆమెయే చిత్రరేఖయై యుండునని భ్రమించి దమనుఁడామెను బల్లకిని బెట్టించుకొని రాజుకడకుఁ జేర్చెను. అత్యుత్కంఠచే వక్కసపడుచున్న రాజునకు బల్యంకమున బాలాదర్శనమునకు మారు బాలదర్శనమయ్యెను! ఏలయన శశిరేఖయీలోపున బురుషవేషధారిణియయ్యెను! రాజునకు వెఱ్ఱియెత్తినట్లయ్యెను! వెంటనే దమనునికి గారాగార నివాసము నాతఁడు విధించెను. కథావిశేషమువల్ల యున్మీలితములై సన్నిహితఫలితములై విస్పష్టములైన ఘట్టమిదియ. ఇది నాటక శరీరమున విమర్శసంధి.

తానుత్రవ్వుకొన్న గోత దమనుఁడే పడెను. చిత్రరేఖకు మదనుఁడే మనోహరుఁడయ్యెను. తనతప్పు దాతెలిసికొని సుదర్శనుఁడే తనంతదాను బుద్ధిసాగరుని కారాగార విముక్తునొనరించెను. ఇదియిట్లుండ శశిరేఖ—కష్టాంతముగా బరిణమించుచున్న కథను సుఖాంతముగా మార్చిన శశిరేఖ—సుదర్శనుని వరించెను. కథయందలి ఫలితములివి. ఇది నిర్వహణసంధి.

## పాత్రపోషణము.

పాత్రలెల్ల సమంజసముగా బోషింపఁబడినవి. అందును మిగుల సమంజసముగా బోషింపఁబడిన బుద్ధిసాగరదమన పాత్రలను బరిశీలించుదము.

బుద్ధిసాగరుఁడు సార్థకనాముఁడు- మహోద్యముఁడు. ఇతని ప్రజ్ఞయాగంధర్వము. సుదర్శనరాజకీయ నౌకను సురక్షితముగా నడిపిన కర్ణధారుఁడు. రాజభక్తికిఁ గన్నకొమరునిగూడ బలినీయసంసిద్ధుఁడైన యుదాత్తనీతిజ్ఞుఁడు. తనకష్టములకెల్ల మూలకందమైన సుదర్శనుని తనలోఁదానైన నిందిచుకొనని సౌజన్యరాశి. ఇది మిగుల సమర్థతతో బోషింపబడిన పాత్ర.

దమనుఁడు 'యాచకో యాచకశ్శత్రుః' అనునార్యోక్తికి లక్ష్యమైనవాఁడు. గాఢాంధబంధురమై కడుభయంకరమై మిగుల నగాధమైన సముద్రగర్భము వంటి దీతని మానసము అదియీర్ష్యా విషపూరితము; మిగులగంభీరము. కథనెల్ల గష్టాంతముగా మార్పఁగల యమోఘశక్తి యీతనియీర్ష్యయందు గర్భితమై యుండెను. ఆశక్తికిఁగథ దాదాపుగా బలి యయ్యెను. చదువరుల కితనియెడల నిందాఁక కలిగెడి యప్రియత శశిరేఖాకృత పరాభవమాది సానుభూతిగాఁ బరిణమింపక మానదు. దుండగీఁడైన వీనియెడలఁగూడ మనకు సానుభూతికలుగునట్లుగా విరచించుట కడుసాహసముగా నుండుటేగాక కవికిగల మానవహృదయ వికార పరిచయమును, పాత్రపోషణ నైపుణ్యమును వెల్లడియగుచున్నవి.

శైలిద్రాక్షాకదళీ పాకములుగా వ్యక్తమగుచున్నది. కవితాధార యనర్గళమై యందందుదకపాత వేగముతో బ్రవహించుచున్నది.

కవిగారిట్టి దృశ్యములను పెక్కింటి విరచించి యాంధ్రభాషాసేవనొనర్తురుగాక యని మామనోరథము.

గుంటూరు
16—7—23

కొప్పరపు సుబ్బారావు.

# ఇందలి పాత్రములు.



## పురుషులు.

| | |
|---|---|
| సుదర్శనుఁడు | రాజు |
| బుద్ధిసాగరుఁడు | ప్రధానమంత్రి |
| దమనుఁడు | ద్వితీయమంత్రి |
| మదనుఁడు | బుద్ధిసాగరుని కుమారుఁడు |
| సయ్యదహమ్మదుఖానుఁడు | నవాబు |
| రామశర్మ | పురోహితుఁడు |
| వీరవర్మ | రామశర్మ విహితుఁడు |
| దూతి | |
| కారాగృహాధికారి | |
| సూత్రధారుఁడు | |
| మారీషుఁడు | |
| సేవకులు | |

## స్త్రీలు.

| | |
|---|---|
| శశిరేఖ, చిత్రరేఖ | కళింగాధీశుని పుత్రికలు |
| భాగ్యశ్రీ | బుద్ధిసాగరుని భార్య |
| చలికత్తె | |





Expired on 9th May, 1919.

# కృతిసమర్పణము

ఉ॥ వ్రాసిన గద్యకావ్యములు । వాసిగనంగఁ బ్రచారసాధనల్
చేసితి ; నాటకంబుల ర।చింపఁగఁ బ్రోద్బలమిచ్చితో, పితా!
వ్రాసి వినంగఁ జేయఁగల । భాగ్యము నోచుకొనంగ నైతి వ
న్బాసి దివంబు కేగుకత।నన్ ; గృతినైన గ్రహింపు వేడెదన్॥

గ్రంథకర్త.

శ్రీ శ్రీనివాసో విజయతే.

# బుద్ధిసాగరవిజయము.

## నాంది

శా॥ శ్రీమంతుండయినంతమాత్రమున గ ర్వీభూతచేతస్కుఁడై
స్వామిం బైతము లెక్కసేయక వృథా వ్యాసంగముల్సేయుచుం
దా ముందంజను వేయ దైవలిఖితా ర్థంబెట్లొ యట్లాట, ఖే
దామోదంబులఁ గూర్చు కృష్ణుఁడు ప్రప న్నానీకముం బ్రోచుతన్॥

చ॥ సమయవిహారి, గోపకులచంద్రముఖీహృదయాపహారి, సాం
గమదను, డద్రిధారి రసికప్రవరుం, డురుబుద్ధిసాగరో
న్నిమహితు, డాదిపూరుషు, డమేయుఁడునైన సుదర్శనుండు, ని
త్యము మిముఁ బ్రోచుగావుత చిరాయురుపేతవిభూతిదాయియై॥

(నాంద్యంతమున సూత్రధారుఁడు పుష్పాంజలిని సభాస్తారులపైఁ జల్లి)

సూత్ర — బావా! రావేమి?

మారిషుఁడు — (లోననుండి) నీవు పనిఁ జేయుచుండుము. నేనిక్కడనుండియే "ఊఁ" అనుచుందును. పాఠము మొదలు పెట్టుము.

సూత్ర — బావా! నీకై సభవారు నిరీక్షించుచున్నారు.

మారి — నీకుఁ వకాల్తునామా యిచ్చిపంపినాను. మనవి చేసికొనవయ్యా. వెనుకముందులు సర్ది చెప్పుకొనుటకును సర్దుకొనుటకును సామర్థ్యములేనివాఁడ వెట్లు సూత్రధారుఁడనని తగుదునని పోయితివి?

సూత్ర — ఓయీ! గడుసరి! నీతో; నాకేమి! గుండ్రాయి లేకున్నఁ గూఁతు పెండ్లియాగునా? ఆహా! ఏమి నాభాగ్యము సర్వకళాసమన్వితులగు సత్సభాస్తారులచే శోభాయమానమై వెలుఁగుచున్న సభం గాంచఁగల్గితి. లోపాలోపంబుల సైరించి రూపకము నాదరభావంబునఁ దిలకించి సామాజికులమగు మమ్మును బ్రమోదితాత్ములంజేయ సభవారి కంజలిఘటించి ప్రొక్కువాఁడ.

మారి—(ప్రవేశించి) బావగారు దిక్కులుచూచుచున్నారు. పైముక్కలడుగునంబడి నట్లున్నవి. వివరింపఁదగినది గ్రంథకర్తవిషయము.

సూత్ర—బావా! నిన్నిందులకేగదా నే నపేక్షించుట. సమయమునకు లేనిది ......... ఎందుకో యనినట్లుగాక ప్రత్యక్షమైతివి వినుము.

సీ॥ అదిభిక్షునుబెట్టి ♦ యభ్యుదయముఁగోరు
హానుమన్మనీషిని ♦ నాత్మనెంచి
దివికేగిననుగూడఁ ♦ దిలకించుచుండునాఁ
బెనుకూర్మిఁ బెంచిన ♦ జనకుఁ దలఁచి
తనబాధ్యతలెఱింగి ♦ తగురీతిగనుఁ గాచు
మాతృపదద్వయి ♦ మది నుతించి
తప్పుల దిగనాడి ♦ యొప్పున్న గ్రహియించు
మతిమంతులకు భక్తి ♦ నతు లొనర్చి
తే॥ గీ॥ కార్యసిద్ధికి శ్రీమనః ♦ కాంతుఁ గొలిచి
ఆంధ్రభాషామతల్లి సే ♦ వాభిరతిని
వ్రాసె వల్లి వేంకటసుబ్బ ♦ రావు "బుద్ధి
సాగర విజయ" మనెడి దృ ♦ శ్యంపుఁగృతిని॥

ఈగ్రంథరచనకుఁ గారణకారకులఁగూర్చి యిట్లనుమనియె.

తే॥ గీ॥ వచనరచనలఁ దిలకించి ♦ పరమపథులు
పద్యరచనకుఁ గడఁగఁ బ్రో ♦ ద్బల మొసంగ
వ్రాసె దుర్యోధనపరాభ ♦ వము నునాట
కంబు హితులకుఁగల కోతు ♦ కంబు దీర్ప.

పైనాటకంబున కాంధ్రప్రపంచ మొసంగిన యాదరణమే యీ ద్వితీయకృతికి నూతయయ్యె.

మారి—బావా! రూపకావలోకసద్భావతత్పరులై వేచియున్న సభికులు కాలహారణంబున కోర్వఁజాలరు. పగుదము రమ్ము.

సూత్ర—మంచిది.

(ఇరువురును వెడలుదురు)

ప్రస్తావన.

శ్రీ శ్రీనివాసో విజయతే.

# బుద్ధిసాగరవిజయము.

## ప్రథమాంకము.

### ప్రథమరంగము:—అడవి.

(బుద్ధిసాగరుఁడు నిదురించుచుండును.)

(తెరలో) ఔరా! ఈదీనురాలిమొఱ యాలకించి సంరక్షించువారు లేరా! కావరారా! ఓవృక్షరాజములారా! మిమ్మాశ్రయించి యుండు భూత, ప్రేత, పిశాచగణంబుల నన్నాహారముగఁ గొనఁ బంపుఁడు. ఈ మదోన్మత్తుని వశమగుటకన్న నట్లుసరులంబాయుటే ప్రశస్తకార్యము. ఆహా! నే నెంతపాపాత్మురాలను. ఇంతగ విలపించు చున్నను నాయార్తనాద మాలకించి కావనేతెంచువారు కఱవైరిగా. ఓ! అమరులారా! మర్త్యులారా! వంటయింటికుందేలనైతివి, ఎందేగెదవని, మదగర్వంబజ్ఞానంబునఁ ద్రోయుఁడు, ప్రపంచమునుమఱచి నోటికివచ్చినటులఁ బ్రేలుచు, పరమదౌర్భాగ్యుఁ డొకఁడు నన్నపహరించి కొంపోయి మానభంగ మొనర్పఁ గృతనిశ్చయుండై యేతత్సన్నాహంబున నున్నాఁడు. ఏమహాపురుషులైనను నాపాలి దైవములై నాకు నండమై యాదుకొనుఁడు. మానవతిని రక్షించి పుణ్యముఁ గట్టుకొనుఁడు. రక్షింపుఁడు! రక్షింపుఁడు! ఆర్తజనరక్షా దీక్షితులగు పురుషసత్తములారా! నావిన్నపమాలింపుఁడు. ద్రౌపదీ మానసంరక్షకా! శ్రీకృష్ణపరమాత్మా! రక్షింపుము. రక్షింపుము.

బుద్ధి—(నిద్దురనుండి దిగ్గున లేచి) (స్వగతము) హా! ఇమ్మహారణ్యంబున స్త్రీరోదనము విననయ్యెడి. కలవరమా; యథార్థమా? (నల్దిక్కులఁ

గలయుంజూచుచు వినుట నభినయించును.) (తెరలో) ఛీ! ఛీ! ఇది ఎట్టిపాపిష్ఠిపుడియు! మానవతులఁ గారించు నధమాధముల దండించి మానరక్షణ మొనరించు మానసీయుఁడే లేఁడయ్యెఁగా లోకమున నట్టివారు వట్టిపోయిరి కాఁబోలును.

బుద్ధి—ఓదొడ్డతల్లీ! అంతటనాగుము. ఆగ్రహానలసంతప్తమానసవై నిజసుతులపై జాలి వీడకుము. మానధనుల సరళపరుషవాక్యఫలంబులనిర్వచనీయ శుభాశుభంబులే యగు. తల్లీ! ఆలస్యంబునకుక్షమింపుము. మించినదేదియును లేదు. నీమేన ప్రాణంబులకు నా ప్రాణమడ్డము. (ఆ దిక్కున పోవును.)

(బుద్ధిసాగరుఁడు చిత్రరేఖతోఁ బ్రవేశించును.)

బుద్ధి—ముద్దుబిడ్డా! నీ తలిదండ్రు లెవరు? ఈవిపినంబున నీ దుర్మార్గులచే నెట్లు చిక్కితివి? నీకథనంతయు సాంగముగ వినఁగోరెదను. నీకెట్టి భయమును లేదు. ధైర్యమును వహించి సవిస్తరముగ వినిపింపుము.

చిత్ర—మానప్రాణంబులఁ గాపాడి యుద్ధరించిన మహానుభావా! యంజలిఘటించి ప్రస్తుతించెద. నేననంగదేశాధీశుని జ్యేష్ఠపుత్రికను కొంతికాలముక్రిందట మా వీటి కొక నెలంతుక పేదరాలుగఁ జేరి సైరంధ్రిగ నెంతయో నమ్రతతో మెలంగుచుండెను. నల్లనివన్నియు నీళ్లు, తెల్లనివన్నియుఁ బాలుఁగ నమ్మిన మా యక్క చెల్లెండ్ర మాపెను కృతజ్ఞురాలుగ నమ్మి యాపెవెంట మామూలురీతిగనే యుద్యానవనమునకు విహారార్థము బయలువెడలితిమి. మమ్ము నా నీచురాలు మాటలసందడిని దారిఁ దప్పించి యొక నిర్జనప్రదేశముం జేర్చి పైనద్దియో చల్లెను. వెంటనే మూర్ఛిల్లితిని. పదపడి తమచేఁ గృతాంతు నిలయమున కతిథులుగఁ బంపఁబడిన దుర్మార్గుల కధీనవగుటఁ దక్క నొండెఱుంగను.

బుద్ధి—అమ్మా! ఆ దాసి మాయంపఁజేసినాడే దుశ్చింతతోఁ జేరెనన నోపు. అనిచు రాండ్ర మనంబుల నెఱుఁగజాలక వారివేషభాషలకు

జాలిఁగొని చేరఁదీయుటయే మనలోపము. పిల్లివలెఁ జేరి బెబ్బులు లగుదురు. కపటమైత్రిం జూపుచుఁ దుదకెట్టి యాగడంబులకైన నుడి గట్టుటకు సాహసింతురు. (స్వగతము) రాచకార్యంబుల నిర్వర్తించి యుజ్జయినీ పురంబునుండి బయలుదేరిన నాటి శుభశకునంబుల ఫల మూదారితప్పి యరణ్యప్రవేశ మొనర్పుట యనివిధిందూరితిని. గాని దైవానుగ్రహమ్మున నీనాఁటికి నాయీప్సిత మీఁడేర్చు గనము సమీపించుచునట్లున్నది. రతీ మన్మథు లట్లు యీకన్యకానురాగమంబున మా సుదర్శనుఁడు ప్రకాశించుటొప్పు. నేఁటికి ధన్యుండనైతిని. ఐతినా? ఈ శృంగారవతి మనోనిశ్చయం బెఱుంగకయె యిట్లనుకొనుటెట్లు? పొరపడితిని; పొరపడితిని. ఇట్లని చూచెదఁగాక.

(బహిరంగముగ)

తే॥ గీ॥ పగల లెస్సఁగఁ బొగలెడి ♦ వారొ నిన్నుఁ
గన్నవారలు దూరము ♦ గాఁగ నీవు
గర్భదుఃఖంబునకు మేర ♦ గలదె తెలుప
కడుపులోపలఁ జెయివెట్టి కలఁచి నటులె॥

కాన వైళంబ నిన్ను నీవారిఁ జేర్చుటయే న్యాయమని నా నమ్మకము.

చిత్ర— (స్వగతము) హా! ఈ ప్రాజ్ఞశేఖరునకు నీ దీనురాలి దుస్స్థితి విదితముగాక లోకముతో పాటుగ నెంచుచున్నాఁడు. హతవిధీ! నా నోఁటిమీఁదుగ స్వీయచరిత్రము చెప్పించుచున్నావు గదా!

(బహిరంగముగ)

ఉ॥ తల్లియుఁ దండ్రియుం గతియుఁ ♦ దామె దయానిధి యెవరులేరు, నా
చెల్లెలి కట్టి ముప్పాదవఁ ♦ చేసెను, తాదృశు లేరు గాచిరో
తల్లడముందునే సవతి ♦ తల్లికిఁ దమ్మున కాత్మలందు నే
నొల్లఁ బురంబుఁ జేరఁ గఠి ♦ నోక్తుల గాసిలఁ జేతు రీవయిః।

తల్లిలేని పుట్టినిల్లు నిరర్థకమండ్రు. తల్లి మృతినొందినపిదపఁ దండ్రి పినతండ్రితో సమానుడండ్రు. ఈ రెండు సౌఖ్యంబుల

ననుభవించుటయే గాక సవతితల్లిని మరగిన కన్నతండ్రి యపాంగ వీక్షణంబులచే సంతుష్టి నొందవలసినవార మైతిమి. ఆపాటి యోగ్యతకుఁగూడ నపాత్రులమై పితనుగూడఁ బొట్ట నిడుకొంటిమి. భర్తృ యజ్ఞానపు టాజ్ఞయనెడి శృంఖలఁ గట్టువడి యొక్కొక్కరప్పుడించుకంత ప్రేమంజూప వలసెఁగా యని కుంచు నాపెకు స్వేచ్ఛ గలిగె. అప్పు డాపె చక్రాహాతికిం దగినవారు, మాకన్న నొండొరు లెవ్వాలా? పాపపుణ్యంబు లా పరమాత్ముఁడే యెఱుఁగు. త్రికరణ శుద్ధిగ నా నమ్మిక యేమన, మాకొనఁగూడిన యీ దుస్థితికి నాపె ప్రోద్బలమే మూలకారణమని.

బుద్ధి—అమాయకురాలా! ప్రపంచ చిత్రవిచిత్ర చరిత్రంబులు నీ కగోచరంబులు. వెఱ్ఱికుమారీ! వినుము.

తే॥ గీ॥ గర్భశుక్తి ముక్తాఫల ♦ కామి యగుచు
నిజసుఖం బోడి కనుఁ బడి ♦ నెలలు మోసి
కంటి కగు ఱెప్పపోలికఁ ♦ గాచి పెంచు
తల్లి ప్రేమకు సాటి దీ ♦ ధరణిఁ గలదె॥

తే॥ గీ॥ తల్లి భూమి, పాలికుఁ డనఁ దండ్రి చెల్లు
తాలొ, బోలునొ, సమబుద్ధి ♦ ధరణి యొసఁగు
తండ్రి విడఁదీయుఁ దాలును ♦ దండులములు
కన్నవారల ప్రేమ లీ ♦ కరణి నుండు॥

తే॥ గీ॥ అనరె రెండవ భార్య నా ♦ నరఁటిపండు
ఆముదంబునఁ దేలుచు ♦ నవని మఱచు
మొదటి యిల్లాలి బిడ్డల ♦ మోముఁ జూచి
కనికరంబునఁ జరియించు ♦ ఘనులె యరుదు॥

తే॥ గీ॥ కంచయే చేనుమేయఁగఁ ♦ గావ నగునె
తండ్రి కన్నులె యవరోధి ♦ తంబు లగుడు
సవతితల్లిని ననుట దో ♦ షమ్ము గలదె!
మహినిఁ గందకు లేక చే ♦ మకును దురద॥

చిత్ర—పితృసమానా! నా స్వల్పానుభవంబున కనుగుణంబుగఁ దమ రాడిన వాక్యరత్నంబు లత్యంత నీతిదాయకంబులు.

బుద్ధి— సుతా! నీ కే కొఱంతయుఁ గలిగింపక నాయింటం జేర్చి శీఘ్రకాలంబున నొక సుందరకారుండగు రాజేంద్రున కొసంగి పరిణయ మొనర్చెద.

చిత్ర—తండ్రీ! నాయెడ తమ రవ్యాజ కరణోపేతులై రాజ్ఞిగ నొనర్ప సంసిద్ధులైనట్లు భావము సూచించినందులకు వందనసహస్రంబు లొనర్చెద. రాచవారలయింటి మర్యాదంబట్టి మన్మనోకాంతుని వరించుకొను హక్కు నేను వహించియున్నానని విన్నవించుకొనుచున్నందులకు మన్నింపుఁడు.

ఉ॥ బింక మిదేంత యంచుఁ బెద ♦ విన్ విఱువన్ వల దార్యభూపవా
మాంకముఁ జేరు భాగ్య మల ♦ యబ్జభవుండు లిఖింపకున్న నే
శంకయు దోపఁగూడ దనఁ ♦ జాలుదు నేను, వచింతు మున్న, ఱే
మంకరమిద్ది! ఏల మొగ ♦ మాటపు టర్మిలి టొంకు మాటలున్॥

కానఁ బరభృతత్వంబున కోడి స్వయం వ్యక్తిస్వాతంత్ర్యంబులఁ గోల్పోవ నిచ్ఛగింపను. ఈ నా పల్కులు తమ కించుక మనోవైకల్యంబుఁ గూర్చునను భయము గలిగెడి.

బుద్ధి—బాలా! మాతేనికై కన్యాన్వేషణంబు నొనర్చుచున్నవాఁడ నగుట, వెతుకఁబోయినఁ దీగె కాలికిఁ దగిలినట్లు దైవనియతిచే గన్యకామణి వచ్చుటచేతను, సురూప సుగుణ సంపత్తిచే నలరారు బాలికామణి వౌటను, నా యాంతరంగికాభిప్రాయంబును బ్రకటించితి. సృష్టికిఁ బ్రతిసృష్టి నొనర్ప సామర్థ్యముఁ గల వాఁడనా? ఘటనాఘటన సమర్థుండనా? నీ పురోవృద్ధిఁ దెలిపితి. అందులకై నిర్బంధించి కొంపోవుట లేదు. ఇంకొకతూరి యభయ మొసంగుచున్నాఁడను; నమ్ముము. (స్వగతము) మానవతులకు మానరక్షణమే ముఖ్యముకదా. కులమునుబట్టి బుద్ధు లుద్ధతులం

జెలంగు. కులపుఁ గట్టడులమ, నాత్మస్వాతంత్ర్యంబును రాణిపదంబు నకన్న మిన్నగ నెంచె. ఔరా! ఈ సుగుణవతి బుద్ధిబాహుళ్యము!
(బహిరంగము) అమ్మాయీ! పోవుదము రమ్ము.

(ఇరువురు వెడలుదురు.)

---

ప్రథమాంకము.

ద్వితీయరంగము. (రాజభవనము)

(మదనసుదర్శనులు ప్రవేశింతురు)

సుదర్శనుఁడు — మంత్రికుమారా! ఎల్లరకును కుశలమా?

మద — రాజేంద్రా! చిత్తము. తండ్రిగారు రాచకార్యంబుల నిర్వర్తించుకొని గృహోన్ముఖులైనట్లు వార్తలెవ్వేని నేతేరెనా?

సుద — ఉజ్జయినీ పురంబునుండి పయనమైరఁట. వారు లేని కొలఁత ప్రతిక్షణంబును నన్నలజడిపెట్టుచున్నది.

మద — కలఁడుగదా, ద్వితీయామాత్యశేఖరుండగు దమనాఖ్యుఁడు. తమ రట్లువచింప నేల?

సుద — వారియువురిలోఁగల తారతమ్యంబులే నాయొక్కయు గతించిన మానాయనగారి యొక్కయు మనఃఖేదంబుల కాస్పదంబులు. వారిరువురిలో నైకమత్యము లేదు. దమనునకుఁ బట్టుదలయే ప్రధానము. బుద్ధిసాగరునకుఁ బ్రతివిషయమునకుఁ బ్రతిఘటించి నిలుచుటయే ప్రధానాంశము. వారు లేని తరుణమున వారొనర్చిన విషయములఁ దలక్రిందొనర్చుటయం దమోఘబుద్ధిసంపన్నుఁడు. అట్టి దీమధ్యకాలంబులో సంభవించకుండ జాగరూకతతో మెలంగు భారము నాభుజములపై నున్నది. వారలైనచో దమునుని వ్యర్థప్రలాపంబులకు నకారణంబుగ బదులొసంగుచు యథావిధి సక్రమ పరిపాలనంబునకుఁ దారిచూపుచుందురు. వీరిలో వీరికే భేదభావము లే లేకయున్న రాజ్యపాలన మెంత సుకరముగ నుండును. వీరలం బట్టియేగదా!

ప్రజలలోఁ గక్షలేర్పడియు అన్యోన్యత వీరలలోఁ బొడమిన సర్వ మంగళంబు లీడేరు.

మద—నృపాలచంద్రమా! తరతరములనుండియు స్థానబలములవలనఁ బదవులతోపాటు భావములును స్థిరపడిపోయినవి.

(తెరలో సేవకుఁడు)

సేవకుఁడు—మహారాజునకు జయము గుఁగాక! రెండవ మంత్రిగారు వాకిట వేఁచియుండి దర్శన మపేక్షించుచున్నారు.

సుద—ఓరీ! వారిని సత్వరముగ లోనికిఁ గొనిరమ్ము.

మద—రాజసత్తమా! సెలవ్వసంగెదరా? పోయివచ్చెద.

సుద—బాల్యమిత్రమా! మంచిది పోయిరమ్ము. జరిగిన ప్రసంగము లతిరహస్యములు సుమీ!

మద—రాజేంద్రా! తమ బోటివారి సాంగత్యమున నిట్టివి పరిచితంబులు.

(మదనుఁడు వెడలును)

(దమనుఁడు ప్రవేశించును)

దమ—నృపాలమౌళి దీర్ఘాలోచన నిమగ్నులైనట్లున్నారు.

సుద—అమాత్యశేఖరా! అట్టిదెద్దియును లేదు. ఆయూర్జ్వానసంబునను పవిష్టుండవుగమ్ము బుద్ధిసాగరుని వృత్తాంత మేదైనఁ జారులు తెచ్చిరా?

దమ—రాజా చారులరుదెంచు వేళమీఱలేదు. వచ్చిన రావచ్చును. ఈమాఱుల తప్పక వాగ్దత్తముఁ జెల్లించుకొని వచ్చెదనని యమాత్యుఁ డేగినట్లున్నది.

సుద—మంత్రివరా! వాగ్దత్తమేమి? చెల్లించుకొని వచ్చుటెట్టిది?

దమ—ఓహో! రాజసత్తమునకుఁ గార్యభారంబునఁ బ్రధానాంశంబగు ప్రధానివాగ్దానమే మఱపునకుం దగిలెంగా? అట్టి ధర్మమా? తమరు మఱచిన విషయమును నేనేల తలచుట? అదిదాగునది కాదు. చంద్రుని విదియనాఁడు కానున్నఁ దదియఁగనరాండుమా?

రాచకార్యానంతరము బుద్ధిసాగరుఁడు రాజకన్యాన్వేషణా భారం బున నిమగ్నుండై క్రుమ్మరుచుండి కాఁబోలు రాకున్న వాఁడు.

ఉ॥ రూపసిగూడదంచనెఁ గు ♦ రూపియు వల్దన జాణలుగా నవి
ద్యావరి పూర్ణులేల యన ♦ ధాతయె తానయి బుద్ధిసాగరుం
డీపుడమిన్ సఖీతిలక ♦ మేర్పడఁజేయున గాధిసూనుఁడై
భూపవినంగఁ గల్గితిమె ♦ భూవలయంబున నిట్టి చిత్రముల్!

సుద — ఓహో! మాయమాత్య శేఖరులకుఁగల విముఖత్వము వలన రాచకార్యములతోఁ బాటు వివాహప్రశంసకూడ విమర్శనా పాత్రమైనట్లున్నది.

దమ — రాజా! మీరట్లుద్దేశించిన నావిషయమంతటనే విరమించు కొందును. హెచ్చరింపనెంచియే యుండలేదు. తమ రవివాహితులై యుండుటయు, సంబంధములన్నిటిఁ దూష్ణీంభావమున నీసడించు టయు నన్నును నాతోపాటు మఱికొందఱగు యుష్మచ్ఛ్రేయోభిలా షుల మనంబులు సందడింప నిట్లాడితి.

సుద — మంత్రివరా! ఇవిసరససల్లాపంబులు. అన్యథా యోచింపకుఁడు. కల్యాణకాలము వచ్చినను గర్మ వచ్చినను నాగదందురుకదా. ఏల యీ విచారము.

దమ — అధీశా! అట్టిధర్మవిశ్వాసమున మిన్నకుండ లేదుగదా?

సుద — కాక నేనొక్కనదెద్ది?

దమ — బుద్ధిసాగరుని సందులకు నియోగింపలేదా?

సుద — లేదు. వారి స్వయంకృషి. వారితోపాటు తమరును చుఱుకుగనే యున్నారు. తిమరు తెచ్చిన సంబంధములు రుచించుటలేదు, వారింతవఱకును చేరొక్కనలేదు.

దమ — ఏకోద్దేశంబు గలవాఁడనౌటను, తావక పాణిగృహీతిని నిర్ణ యించుకొనుభారముఁ దమకు వదలుటయే యుత్తమమని యభి ప్రాయ పడినవాఁడనౌటను నామందబుద్ధికిం దోఁచిన సంబంధములఁ దోడ్తోడనె విన్నవించుకొను చున్నాను.

సుద—మీ వాక్యార్థంబుల రహస్యార్థంబులు గోచరంబగుచున్నవి.

దమ—కల్ల నిజంబులు కాలక్రమంబున విశదపడు. అయ్యుదే దేవార్చనలకుఁ గాలము సమీపించుచునటుల ఘంటారవంబులు విననయ్యెడి. సెలవు ప్రసంగిన నేగువాఁడ.

సుద—మంచిది సెలవు పుచ్చుకొనుఁడు.

దమ—[స్వగతము]

అమ్మయ్యా! ఇప్పటికిఁ గొంతమనశ్శాంతి చిక్కినట్లే. నాపలుకులవలన బుద్ధిసాగరునియెడ భూవిభున కేవగింపు జనింపఁ జేయుటలో కృతార్థతఁ గాంచితి ననుకొనందగు. నేడే నాజన్మసార్థకతఁ గాంచెననవొప్పు. రాజు వశ్యుఁడగుటయేకాక మంత్రిసుతుఁడగు మదనుని సందర్శనముకూడ లభ్యమయ్యె. ఈదినమే సుదినము. అతనిని బుజ్జగించి చేరఁదీసి నూరిపోసితిని. కుటుంబములోఁ బొరుపుఁ బుట్టించితిని. ఈచిచ్చు బుద్ధిసాగరుని కుటుంబమును దహింపకతప్పదు. మదనునితో, నీడుమీఱిన కొడుకు ప్రీవింటనుండ నిన్నుఁగాదని మున్ముందు రాజున కర్ధాంగి నన్వేషించుటకు మీ తండ్రి రాచకార్యంపు మిషచే నెల్లెడల గ్రుమ్మరుచున్నాడంటిని. పిచ్చికుక్కవలె నీతండు ఎప్పటికైనఁ దండ్రి తేఁబోవు కన్యకకై వేచియుండి యపహరింపఁ గృతనిశ్చయుండై యుండు. అంతవరకును ముక్కుమూసికొనియుండి నాకోర్కెసిద్ధింపగనే తేనిం జేరి బుద్ధిసాగరుని కుబుద్ధులిట్టివని నమ్మంజేసి నాకసిఁదీర్చుకొందుఁగాక.

[దమనుఁడు వెడలును.]

సుద—ఆహా! కలి చిత్రము. కాలమహిమము.

తే॥ గీ॥ అరయ దమనాఖ్యుఁ డిపుడిట ♦ కరుగుటకును
గారణంబేది? బుద్ధి సా ♦ గరుని యెడల
ఆత్మఁగలయట్టి కూర్మిఁబో ♦ నాడఁజేయ
వెగటుమాటల వివరించు ♦ విధముదక్క!

ఔరా! క్రోధమెంతలేసి పనులం జేయించును! ఓర్వలేమి హెచ్చుగఁ గూర్చును. అకారణ వైర మేర్పడంజేయును. వైరి సంపదయెడ నసూయఁ గూర్చును. శత్రువు కడగండ్లం బడుటకై యుపాయముల నరయించు. అట్టిది సేకూరఁ జేయ స్వీయసుఖంబుల నైన నించుక భంగపాటున కిచ్చగింపఁజేయు. కలుషము నతిశయింపఁజేసి వైరి కపకీర్తి గూర్ప గలవి, లేనివి గూడఁ గల్పింప జొరవఁ గలిగించు. నీతిని, నీమమును, ఖ్యాతిని, మర్యాదను నట్టేటిలోముంచి యెట్టి నీచవృత్తిచేనైనను వైరి పతనమునకై పాటుపడ సాహస మొదవించు. దమనా! ఆతనియెడల నీ కేల నిట్టి కుబుద్ధి? మానవుని సత్యశౌచాది సద్ధర్మ సుగుణంబులే సహచరంబులై దిగ్విజయంబు చేకూర్చు. (వెడలిపోవును)

(తెరవాలును)

---

ప్రథమాంకము

తృతీయరంగము.

(రహస్య మందిరమున మదనుఁడుచితాసనంబున నాసీనుండై యుండును)

మద—

ఉ॥ అంగనపేరు మాత్రమున ♦ నారడిగల్గె మనం బదెంతొ త
న్వంగినిఁ గాంతు ముందనెడి ♦ వాంఛ పితర్ నిరసింపఁ జేసె నా
సంగడి కాఁడు నా నృపతి ♦ సఖ్య మదెంతని దోఁచఁ జేసెఁ గ
న్నుంగవ కాంత గన్నన మ ♦ నో ధృతులెట్టులఁ దెల్లవారునో॥

సుదర్శన క్షితీంద్రు దర్శనానంతరము మందిరమునుండి వెలువడునెడ దమనుఁ డేల గన్పట్టె? నిర్మలంబగు నామనంబున కింతం తెనరాని యాయాసంబు లవరచె. సంపూర్ణాంధకారంబునం బడక పూర్ణమగు వ్యక్తతలేక గోలనై పోయితి. ఆలోచనలకు మేరలేదు. యుచితానుచిత విచక్షణాజ్ఞానము నశించినది. ఇద

సిద్ధమని నిర్ధారణ చేసికొనుటకు స్థిరచిత్తము లేదు. గగన పుష్పంబుపై నాసను గలిగించి చిత్తవైకల్పికత్వముఁ గూర్చిన దమనా! నిన్నేమనందు. ఏక పుత్రిండనని యసమాన కరుణా విశేషంబులఁ బెంచుచున్న తండ్రిగారి కిట్టి బుద్ధియేల అంకురించె? సుదర్శన భూధవునకుఁ గన్యను జేకూర్చు భార మీయనగా రేల వహింపవలయు? ఇందుఁ దప్పిద మేమున్నది? లేకపోలేదు. అవివాహితుండ నగు నా మాట మఱచి యితరుల బాధ్యత వహించుట! ఇరువురు బాలికారత్నములకై వెదుకుచున్నా డేమో? అప్పుడు నాకును నామిత్రుఁడగు సుదర్శనునకును స్వయంవరంబులవల్ల భేదాభిప్రాయంబులేల పొడమకుండు? మాతండ్రిగారీవిషయంబున జోక్యము వహించుటలో దూరాలోచన యొనర్చినట్లు కన్పట్టదు. నేను వారి యాజ్ఞలఁ దిరస్కరించువాఁడఁ గానని నాయనగా రభిప్రాయపడి యుందురు. కాని మదోన్మత్తత యీ మదనునితండ్రి వాచాశృంఖలల విదళింప జేయునని భీతి పొడముచున్నది. బొమ్మ తెరచాటున నుండఁగనే యీ మదనుని పోకడ లిట్లుప్పొంగి పోవుచు వివిధగతులఁ బ్రేలించుచున్నది. తెరదాటినంతట, నిప్పుద్రొక్కనఁ గోఁతి నాడును గాఁబోలును. మొదటి కంటిన యీ వ్యామోహము కంకరపట్టు పట్టినది. ఏపనియందును బుద్ధిని జొరనిచ్చునట్లు లేదు. ఏకాంతముననున్నకొలంది నద్దముఁజూడను, దిద్దుకొనను, బుద్ధులన్నట్లు వికారంబు లెక్కువగుచున్నవి.

ఉ॥ లోకము వారలందరు వి ♦ లోకనఁ జేయఁగ నన్నుబోలు సు
శ్లోకుఁడు లేఁడటంచు ధర ♦ లో నిఁక నందురె మారుబారికేఁ
దాకి పితేచ్ఛలన్ జెఱుపఁ ♦ దారసిలన్ గొన నాపతీమణిన్
మేకొనుమాత్మమా! తనకు ♦ మించినధర్మము లేదు భూస్థలిన్।

ఇదియె నానిశ్చితాభిప్రాయము. ఇతరుల దయాదాక్షిణ్యంబులతో నాకణుమాత్రమేని సంబంధములేదు. నాస్వతంత్రభావము నరికట్టువారేరును లేరు. ప్రతిక్షణంబును జరుగుచున్న విశేషంబుల నతిజాగ్రత్తతో గమనించుచు ఫలమునందుకొన నిరీక్షించుచుందుఁగాక!

(వెడలిపోవును; తెరపడును.)

---

# బుద్ధిసాగరవిజయము.

## ద్వితీయాంకము.

### ప్రథమరంగము.

(బుద్ధిసాగరుని మందిరము)

భాగ్యశ్రీ—(ఇటునటుచూచుచు) నాథుఁడేల ననుఁజేరరాక యాలసించుచున్నాఁడు. దాసియనృతమాడెనా? చూచుటనభినయించి నాథుండు పరపురుషునితో నంతఃపురమును జేరవచ్చుచున్నాఁడేటి విడ్డూరము! కానిమ్ము; ప్రాణనాయకుఁ డభిలషించిన కార్యమేనిట్లు సందేహించు టొప్పదు.

(బుద్ధిసాగరుఁడు సహచరునితోఁ బ్రవేశించును)

భాగ్యశ్రీ—నాథా! ఆజ్ఞసేయ నిదె ప్రణమిల్లుచున్నది.

బుద్ధి—దీర్ఘాయుష్మాన్భవ. [సహచరునుద్దేశించి] చిత్రరేఖా! ఉడుపులం దీయుము. (భార్యనుద్దేశించి) కాంతా! ప్రయాణపు టాయాసంబున నిబ్బాలికామణి బడలియున్నది. తగుయుపచారంబు లొనర్పంబడునట్లు చూడుము. ఈ యంతఃపురమునందే యీపె నుపచరించునట్లు దాసీల కాజ్ఞలొసఁగి యాహారాదులుగూడ నిందేఁ జేర్పఁబడునట్లు ముదలనిచ్చి నీవిటకు శీఘ్రంబుగ రమ్ము.

బుద్ధి—ఓరీ! ఎవరురా అక్కడ?

సేవకు—చిత్తము. దేవరవారి పాదసేవకుఁ డిందున్నవాఁడు.

బుద్ధి—సేవకా మదనునిఁ దోడ్కొనిరమ్ము.

సేవకు—చిత్తము.

[మదనుఁడు ప్రవేశించును]

మద—నాయనగారి పాదపద్మములకు నమస్కారము.

బుద్ధి—చిరంజీవిగమ్ము. ఆయాసనంబున నాసీనుఁడవుగమ్ము. మోము కళావిహీనమైయున్న దేల? శరీరమం దస్వస్థత యేమియు లేదుగదా?

మద—తండ్రీ! నాయెడఁగల పరిపూర్ణానురాగమే మదనాస్వస్థతయా యని ప్రశ్నింపఁజేసె. కలత నిదురనుండి లేచి వచ్చుటయు అయ్యది మనంబు నమితంబుగ నాయాస పఱచినదియుఁ దలపని తలంపగుటయు మోమున కళమార్చి యుండనోపు.

బుద్ధి—అట్టిదేదీ పేర్కొనుము.

మద—తమరే తెంచినట్లు విని యేను తమరిని దర్శింపరాఁగా నేతత్కాలంబునఁ దమహస్తగతంబగు వస్తువు నొకదానిని రహస్యభేదశంకచే నాకంటఁ బడకుండ గుప్తముగ దాఁచిన ట్లే గలగంటి. అభేదవృత్తిని మెలంగు మన కీయర్థవిహీనమగు స్వప్న మేమాయని కలలోనే నాలోనే వితర్కించుకొనుచు దల్లడిల్లితిని.

బుద్ధి—కుమారా! కలలోఁగూడ నిట్టిది పొడమదని దీనిభావము. శాంతివహింపుము. నిద్రాభంగ మొనర్పక నీలు లేదయ్యె. ఈక్షణంబున నీవిందుండి పయనంబై ఉజ్జయినీపురంబేగ వలయు నిటురమ్ము.

మద—సమీక్షించును [బుద్ధిసాగరుఁడు చెవిలో నేదియో జెప్పును]

బుద్ధి—ప్రియసుతా! గ్రహించితివా? సత్వరముగ నేగుము.

[మదనుఁడు వెడలిపోవును]

బుద్ధి—

ఉ॥ నందనుఁడాడినట్టి వచ • నమ్ములె సాక్ష్యము, గాన రాత్రిలో
మందిరమందుఁ జేరి తను • మాటఁ గనుంగొనెఁ బొంచియుండి, మే
నందముఁ గప్పిపుచ్చి, పురు • షాగ్రణి వేషము, బాల తాల్చినన్
ముందుగ మొండిచేతులఁ బ్ర • మోదమునన్ వెలిబెట్టితే సుతా!

అమాయకుఁడగు సుతుండు తనబుద్ధిసూక్ష్మత బయలుపఱుప నిట్లాడెనేగాని నిజసంకల్పంబునకు విఘ్నకారణంబని యెఱుఁగఁ డయ్యె. చతురుండగువాఁ డెయ్యెడల నిజాభిప్రాయంబును దాచి కార్య తత్పరుండై యుండు. ఉజ్జయినీపురంబునుండి సుతుఁ డరుదెంచు లోపల విషయంబులఁ జక్కఁబెట్టవలయు. ఇంతి రాకుండుట కేమి కారణము?

(భార్యప్రవేశించును)

భాగ్యశ్రీ—నాథా! ఆలస్యంబునకు క్షమింపుఁడు.

బుద్ధి—సఖి! ఆ బాలకు వలయు సౌకర్యముల నేర్పఱచితివా?

భాగ్యశ్రీ—చిత్తము.

బుద్ధి—కాంతా! ఈయంతఃపురంబునకుఁ బోతుటీఁగనేని జొరకుండఁ జూచుటయు, సర్వకాలసర్వావస్థలయందును నీ వా నెలఁత నెడబాయ కుంటయు నీ వొనర్పవలసినవిధి. ఉపేక్షయనర్థమునకు మూలము సుమీ! అత్యంతశీఘ్రకాలములో నీకన్యకను మనజేనికొసఁగి వివాహ మొనర్పవలసియున్నది. ఈరహస్యము మదిలో నుంచుకొమ్ము. ప్రాణసఖి! మోము వెల్లదనము నా నియమితకార్యభారంబును సూచించుచున్నది "పుత్రుండగు మదనునియాపుకెట్లా? మొగమాట ములేక పల్కెదరమా?" యని సందేహించుచున్నట్లున్నది. తరుణ వయస్కుండగు తనయుం డిట్టి విషమస్థితియందు నింట నుండుట యుపద్రవకరంబని యీనిమిషంబుననే ఉజ్జయినీపురంబునకనిపితిని.

భాగ్యశ్రీ—ప్రాణనాథా! సుగుణఖనియగు మనపుత్రుండు వివేకవం తుఁడౌకదా? అట్టి దారుణకార్యంబొనర్చునని సందేహమేల? ఎట్లెట్లు?

గ్రామాంతర మంపితిరా? వారముదినములనుండియుఁ బిడికెడు మెతుకులు దినుటలేదు.

బుద్ధి—చెలీ! దమనుఁడు స్వయముగనో యితరుల మూలముగనో మదనుని కైవశపఱుచుకొని దుర్బోధలం గఱపి యంగజుఁబారికిం ద్రోసి నేనొక కన్యందెత్తు గమనించుచుండుమని యుసిగొల్పినట్లు నాకనుమానము. అతని వైఖరియు వచనధోరణియు బాగుగ బట్టిచ్చుటచే మదను సంపుట విధాయక కృత్యమయ్యెను.

ఉ॥ వమ్మొనరించుఁగాదె పర ♦ భామలు వావిని తల్లితోడులే
నుమ్మను నీతిఁ, దెల్వి యగు ♦ శూన్యము దేహికి; గామవశ్యతన్
గొమ్మరో! యింద్రుఁడున్ శశియుఁ ♦ గూడ విచారణ సల్పఁగల్గిరే
క్రమ్మ మదాంధకారము వి ♦ కారము హెచ్చును గ్రుడ్డివౌ కనుల్॥

భాగ్యశ్రీ—నాథా! ప్రపంచానుభవంబున గడతేరిన తమకెద్దియురూహ్యంబగు? ఈతమపదదాసి యాజ్ఞలశిరసావహించి మెలగెడిని. కాలాతీతమగుచున్నది ప్రయాణప్రయాసము వాయ జలకంబాడి భుజింపఁవేడుదాన.

బుద్ధి—ఏమంటివి? అబ్బాయి వారము దినములనుండియు మామూలు రీతి భుజించుట లేదనియా? ఆమాట వినినప్పటినుండియు హృదయము దహింప మొదలిడినది. ఛీ! ఈ పాడు మంత్రిపదంబునుఁ బట్టిగదా నుతు నెడఁబాయవలసె. పదవియే లేకున్న భోజానికిని నాకునేమి సంబంధము? ఊడిగమునఁగదా యీ ముప్పుగలిగె. కుమారునకీయకాలపు పయనము దేహస్థితికెభంగముఁ గూర్చునో. రాకుతున కాలింగూర్ప నెంచుటయు, నిజసూనునకై యూప్రయత్న మొనర్ప కుండుటయు నాలోపము. దైవమా! పుత్రుని యారోగ్యవంతునిగఁ సంరక్షించు భారము నీయది. దుర్బోధనల ఫలంబు లంది సన్మార్గగామియగుగాత! దైవమే యాతనికిఁదిక్కు గుఁ గాత!

భాగ్యశ్రీ—నాథా! బిడ్డనితోదమ రీశాలికామణిని బ్రభునకై దెచ్చితి నని విస్పష్టముగఁ బలికియుండిన నవ్యథా దలంపక సోదరీన్యాయం బునఁ బ్రవర్తిలు చుండెడి వాఁడేమో.

బుద్ధి—కలికీ! ఆతఁడు దుర్బోధలఁ దగుల్కొనియున్నట్లు వాక్యసరళి వివరించుటచే నదొక్క చేత్రోవగ గన్పట్టె.

భాగ్యశ్రీ—పరుల బోధనల జనకు పగౌరవపరుప సాహసించిన యాతఁడు ప్రేమాస్పదుండెట్లగు? విచారము మానుఁడు. ఏగుదము దయచేయుఁడు.

బుద్ధి—మంచిది రమ్ము.

(ఇరువురు నేగుదురు.)

(తెరపడును).

---

—* ద్వితీయాంకము *—

---

ద్వితీయరంగము.

(మదనుఁడు—రహస్యమందిరము)

మద—కన్యారత్నమా!

తే॥ గీ॥ నియపాంగవీక్షణములే ♦ నీరజాక్షి
పైసిఁ బ్రసరింపఁ దనువు కం ♦ పంబునొందె
నిందుచూడ్కుల కెనయైన ♦ నిముషమునను
దనువు బరువును వాప నా ♦ ధార మీవె॥

ఈస్వల్పువ కంతభాగ్యమా? మేఘములలోని మెఱుపట్లు నీవద నము ప్రకాశించుగదే! కళానిధికి కళంకముగలదు. అట్టిది లేమిచే నీమోముజాబిల్లియే శ్రేష్ఠతమము. నీ పాదములకు నిలయము వనుటలో నతిశయోక్తి లేదు.

తే॥ గీ॥ మోమునందమ్మునకుఁ దోడు ♦ ముంగురులును
సొగనుఁగుల్కెడి చేరెఁడు ♦ సోగకనులు

నన్నుఁ గనుమంచుఁ బైఁగొన్న • నాసికంబు
సహజ సౌందర్యభూషలే • చానసీకు
దాఁచ లేఁడాయెఁగాఁదండ్రి • తంత్రకలన॥

నేను తెలివిమాలినవాఁడను, అత్యాశాపూరితుఁడను, నన్ను నేనెఱుఁగనివాడను, ఆత్రగాఁడను.

ఉ॥ ఆముఖబింబదర్శనము • నాత్మ ననారత మిచ్ఛగించు చే
జాముననఁ దండ్రిచేరుఁ గనఁ • జాలుదొ చాలనొ యాశుభాంగి నం
చేమురిపంబునుంటఁ గని • యిందుముఖిన్ బ్రసరించెజాడ్యులం
చే మదమందఁజొద్యమె సు • మీ! చెలికూర్మికి భాజనంబనే॥

అచ్చపలాక్షి దృక్పథంబుపై నింత నమ్మకమునిచ్చి యొండొరుల చూపులు లగ్నమైనవని భ్రమసి యనురాగచింతాభరంబులమునిఁగి దరిఁగాననట్లు తపించు టేటిన్యాయము? నావైపునఁ గాంచియుండి నన్నుఁ గానకుండరాదా? ఆసుందరీ సుందరముఖకమలంబు వీక్షింప నేవేఁచి యుంటిఁగాని, ఆచక్కనే వేఁచియున్నట్లా చక్కరబొమ్మ ఎల్లెఱుఁగు? ఐనదామెనని మిన్నకుండక జనకుండు పిలిపింపఁగ నేనేల వదరితి? నాకరుణయుమమాటఁ దలఁపడని కోపము, గొనితెచ్చిన కొమ్మను కన్నులఁగాంచనీయక దాచి నన్నురప్పించు కొనిగా యను తామసము, ఒడలుమండింప నాగోతిలో నేనేపడితిని. సహనము లేమి నీచేటుమూడె. ఇంటనుండి శక్తికొలఁది శ్రమపడ శృంగారవతి సాన్నిధ్యముక్కనాఁటికేని లభ్యమగుట కవకాశముండి యుండెడిది. చేతులారఁ జెడఁగొట్టుకొంటిని.

తే॥ గీ॥ తండ్రిపన్నిన ప్యూహాభే • దన మొనర్చి
శక్తియుక్తులఁ బ్రకటింప • సామఁజేయ
శృంగభంగము విధియె ని • ర్మించెఁగాదె
గ్రుడ్డునకుసౌన పిల్లను • కొకరింప॥

తండ్రియాజ్ఞ నెన్నక వనితాసందర్శనభాగ్యమే నభిలషించుచు
నింటఁగాకున్న నేమి ప్రచ్ఛన్నవేషంబున నిప్పురవరంబున నేనుండి
తదుపరి వనితాపహరణంబునకుఁ బాదికల వేయుచుందునా? ఛీ!
బుద్ధిసాగరుని పుత్రుండిట్టి నీచకార్యంబున కొడగట్టె నను వదంతి
ప్రమోగదా? జీవితకాలమంతయు నతికీయుండు యపవాదమెట్లు
భరించుట? గర్హ్యుండనై మను టొరుట్వునా? నావిశ్వాసంబురీతిగఁ
బరస్పరావలోకనంబులే ప్రాప్తించియున్నయెడల నారీతి నబ్బా
లయుఁ జలితహృదయయై సంతాపమొందుచుండు. లేకున్న నారో
దన మరణ్యారోదనమననొప్పు. ఏల నాకీవెఱ్ఱి? ఈబాలపై నాకింత
మరులేల? ఇంతకన్న సౌందర్యవతులు లేరనియా? కాదు, కాదు.
ఇకన్యయే నామనోహారి. కూడిన నీమెనే కూడవలయు. గృహస్థా
శ్రమ మీమెతోనే స్వీకరింపవలయు. దైవఘటనయున్నఁ దప్పదు.
తండ్రియాజ్ఞలఁ దారుమారులొనర్చుటయు, దాస దాసీజనంబుల
వశపఱచుకొని చేలంగ్రహించుటయు నేనొల్ల.

ఉ॥ నీవుదమాన దైవతమ ♦ నిష్ఠమెయిన్ వచియించువాఁడ నా
చూపులకయ్యెఁ దాపలము ♦ సుందరి, యన్యుల నేవరింప, నీ
మూఁపులపైన భారమును ♦ మోపితిఁ, దండ్రికిఁ గాంతకోమదిన్
భూపునిరాకరింపఁ దగు ♦ ప్రోద్బల మిత్తువె యెట్లుఁగూర్తువో॥

ఉ॥ ఒండొరులాత్మమెచ్చి మద ♦ నోత్సవమందునఁదేల బ్రహ్మ వ్రా
లుండవలెన్ లలాటమున; ♦ నూరకఁ జంకలఁ గొట్ట నేమగున్
పంతునె యీప్సితంబు, లన ♦ పాయత భక్తులకోర్కె దీర్పఁడే
యండజవాహనుండు నను ♦ నంగజుఁబారికిఁ ద్రోసిపుచ్చునే॥

శ్రీకృష్ణా! నేను నిష్కల్మషుండను. నాప్రేమకాస్పదురాలీ నెలంతఁ
దక్క యన్యులు లేరు. కృత్రిమానురాగముగాదు. మనోవాక్కాయ
కర్మల నేనాకాంతనే ప్రేమించియున్నాను. జనకునాజ్ఞఁదీర్ప నిలు
వీడి యేగువాఁడ. ముకుందా. ఐనవారినిగాని ద్రవ్యార్జనాపరులకులంచ
మిచ్చిగాని వంచన మొనర్చియో బల్మినో కన్యంగ్రహింప నెంచ లేదు.

నీదయను ఆపె మక్కువను నపేక్షించుచున్నాను. నీవే నాయభిమాన దైవమవు.

(తెఱలో) ఆర్యా! నమస్కారములు. ప్రయాణసన్నద్ధులైన యంగరక్షకు లిరువురు తండ్రిగారియాజ్ఞమైవచ్చి వాకిటనిలచితమ రాక నిరీక్షించుచున్నారు.

మదనుఁడు——సేవకా! ఇదే వచ్చుచున్నానని వారికిం దెల్పుము. హామ్మో. ఔరా! కాలమహిమ! నోరుజారిమాటాఁడు టెంతటి యనర్థములకు నాలవాలమయ్యె! తండ్రికి నాయెడఁగల నమ్మిక చెడియె. ఆజ్ఞలధిక్కరించి యుండేనిలచి ప్రయత్నములఁ బ్రతిఘటింతునేమోయని భటుల నన్నడుముకొనిపోవం బుత్తెంచె. నాయవ్యక్తప్రసంగము జనకునికి నాయెడఁగల పరిపూర్ణానురాగంబును పెనునమ్మకమును విడనాడ జేసెఁగా! లేదు, లేదు. నాయనగారు వ్యవహారములు నావ్యామోహంబున మారురూపుఁ దాల్చునని నన్ను పరిహరింపఁ దలఁచిరి. అటులేయగుగాక. నాయనగారి కార్యదీక్షాపరత్వంబును, స్వార్థత్యాగంబును నన్నోముగాత. ఈయస్ఖలిత బ్రహ్మచారి కంకురించిన యనురాగలత యుషఃకాలభానునట్లు క్షణక్షణ ప్రవర్ధమానమై దైవ నియతిచే నఖి మోహనాంగ స్కంధావారంబున కలిబిల్లిగ నల్లుకొనుగాత. తడవుచేయుట లెస్సగాదు. ఏగెదగాక.

[వెడలిపోవును].

(తెరవ్రాలును.)

# బుద్ధిసాగరవిజయము.

## తృతీయాంకము.

### ప్రథమరంగము.

(అంతఃపుర మందిరము. చిత్రరేఖ యాసనమున నాసీనయై యుండును.)

చిత్రరేఖ—బుద్ధిసాగరుఁ డుత్తమోత్తముఁడు. అనుకూలయగు నాతని యింతి సాధ్వీమ తల్లి. నన్ను పూలలోఁ బెట్టి పూజించుచున్నారు. పదచలన మొనర్ప నవసరము లేకుండ నన్నివసతుల సందే యేర్పఱచిరి. వనవిహార మొక్కటియే కొఱంత. నన్నిట్లుంచుటలో వీరియుద్దేశ మీ కుటుంబమువారికిఁ దక్క నన్యులకేనును నా కన్యులును గోచరము కాకుండుట యనుకొన వలయును. మంత్రి వెడలించిన యూహయే దీనికి మాతృక. మేమీ గృహ ప్రవేశ మొనర్చినపు డీ యావరణములో విద్యుల్లతవోలె మెఱసి భ్రమింపఁజేసిన పుణ్యుం డెవండో కదా.

తే॥ గీ॥ త్రోసిరాజను వదన స ♦ రోరుహంబు
పూర్ణశశి నేని, మీస లే ♦ పురుషుఁ గూర్చె
ప్రథమ సృష్టిపైఁగల పక్ష ♦ పాత మొకద
శీతకరుఁడతఁడౌ మనో ♦ వశీకరుండు॥

ఆహా! ఏమి యాముఖసంపద! దీనిఁబట్టి సర్వాంగ సౌందర్యంబును నిరుపమానమై యుండి తీరవలయు.

తే॥ గీ॥ మనము హరియించి మదనసా • మ్రాజ్యలక్ష్మి
గా, గ్రహింప విన్నాణపుం • గాన్కలోయనఁ
బ్రేమపుం జూడ్కులను మనో • ప్రియుడుతాను
పువ్వులుగఁజల్లెఁ బుంఖాను • పుంఖములుగ॥

ఔరౌరా! ఏమియా వన్నెగాని చతురతా విశేషము! బుద్ధిసాగరుని కంటఁబడనోల్లక సందర్శన మాత్రంబున ముప్పిరి గొన్న వలపుఁదెలుప నెంత చిత్రముగ మెలఁగుచు భావాళి వివరించె! తొలుదొల్త నా సుందరాకారుఁడు నిర్మలమగు నా మనము నాకర్షించి తత్తరమందుచు మధ్యమధ్య నక్కుచుండుటేలనా? యని సందేహించుచు నిలిచియుండి బుద్ధిసాగరుని పిలుపున మోహజలధినుండి తెప్పరిల్లి వనరమణీయకమును గనుచుంటినని తప్పుకొంటి. మనోహరా! గాఢముగ నాటనేసిన దృగ్బాణంబుల ధాటియట నానాడు నర్మాన్వేషణఁ జేయుటయెగాక ముందువెన్కలు యోచింపనీయక నేటివఱకు మనంబు నుఱ్ఱూతలూగుచున్నది. నా యుత్తలపాటునకు మేరలేదు. నే ననమర్థురాలను. బుద్ధిసాగరుని స్వాధీనమున నున్నదానను. ఈ విషయంబులు పరిచితంబులయ్యు నుపేక్షవహించి యామహామహుఁడు నన్నాంచి నేలందరాని నా దుర్దినంబు లననుష్ఠు. కమలాసనా! చూపులఁగూర్చిన వాఁడవు ప్రాపు నేలఁ గూర్పవు? ప్రాణదాతయగు బుద్ధిసాగరునకును వానికిను మనోభావంబులు భేదించినట్లే. నా నిక్షేపము జాడయి యుండనోపఁడు. భూపుఁడమాత్యునింటికడఁ దట్టాడుచుండునా? ఇట్టిదసంభవము.

(తెరలో) అమ్మా! నాయనగారు వచ్చుచున్నారు.

(బుద్ధిసాగరుఁడు ప్రవేశించును)

చిత్ర — తండ్రిగారికి సుత యిదే ప్రణమిల్లుచున్నది. ఈ పీఠంబు నలంకరింపుఁడు.

బుద్ధి — శీఘ్రమేవ కళ్యాణ ప్రాప్తిరస్తు.

(పీఠము నలంకరించి) సుతా! కూర్చుండుము. బిడ్డా! కుశలమా! అన్నపానాదికములన్నియుఁ దిన్నఁగ జరుగుచున్నవా? కాఁబోవు మా ప్రభ్వికి నీ దీనుని సపర్య లామోదకరంబులుగ నున్నవా?

చిత్ర— (నవ్వుచు) నా కేలోపంబులును లేక పరమసౌఖ్యంబున నున్నదానను. రెండవప్రశ్నకు బదులాడ నసమర్థురాలను.

బుద్ధి— బాలా! భువనసుందరుండగు మా భూపాలుని రేపటి మాపున త్వదీయ దర్శనార్థము వీడ్కొని రాఁదలచితిని. సుస్నాతవై శ్వేతమృదుకూలంబులం ధరించి, వివిధ విభూషణాద్యలంకృతవై విరాజిల్లుచుండుము. మీ యిరువురి సురూప సౌభాగ్యంబు లొండొరులం బ్రేమించు నను పెనునమ్మిక యధికంబుగఁ గలదు.

చిత్ర— తండ్రీ! దైవము మన కాశ్రమను బాపె.

బుద్ధి— బిడ్డా! ప్రభువు నే వరింపఁ బరాత్పరుఁడు సంకల్పసిద్ధిఁ గూర్చెనా?

చిత్ర— తండ్రీ! సంకల్పసిద్ధిఁ జేకూర్చెంగాని, మీ రనుకొనినట్లు కాదు. నే నల్లనాఁ డనుమానించినట్లే తటస్థించె.

బుద్ధి— ఏమాయెనమ్మా?

చిత్ర— తండ్రీ! నావంటి దురదృష్టురాలికి నృపతి కేల్వట్టు భాగ్యమబ్బునా? తమ రెట్టి దొడ్డ యుద్దేశమున నున్న నేమి? నా నుదుటి వ్రాలును మార్పగలరా? విధివ్రాలు తప్పింప నెవరివశము? అందని మ్రానిపండుల కఱ్ఱులఁ జాచిన నేమి లాభము? తమ యభిప్రాయమునకు దైవ సంకల్పము భిన్నముగనున్న మీ యభిమత మీడేర్ప జాలనిదాన నగుదు నేమో యని నే నలనాఁడే మన ప్రథమ సమాగమ దినమున మనవి చేసికొంటిని. అట్లే మనోవిభుఁడిట నమరె.

బుద్ధి— ఏమేమి! ఇచ్చటనా! విభుఁడా! తటస్థమగుటయా! మాటలు అర్థరహితములు.

చిత్ర— కాదు. క్షమింపుఁడు. అర్థసహితములు.

బుద్ధి—కుమారీ! అతని నెచ్చటఁ గాంచితివి? ఎపుడు గాంచితివి? ఎట్టివాఁడు?

చిత్ర—పురుషవేషంబునఁ దమ గృహప్రవేశ మొనర్చినాఁడు మీ యావరణములోని వృక్షములమాటున డాఁగిన యాతఁడు నా మనంబును దొంగిలించె. మోముమాత్రమే గోచరమయ్యె. ఎవ్వరో నే నెఱుంగను.

బుద్ధి—బాలా! దాంపత్యము జన్మాంతమువఱకు సుస్థిరమై వెలయు బంధము. పాత్రాపాత్రతలు దీర్ఘపుమంతనం బొనర్పందగిన యంశంబులు. మేడిపండువోలె సుందరాకారుల బుద్ధులు విచారణీయంబులు.

చిత్ర—దైవబలంబు మనోబలంబునకన్న మిన్నకదా. మానవుల చర్యలు దైవ ప్రేరితంబులు. దేహి యోగ్యతానుసారముగ సుఖ దుఃఖంబు లనుభవించుచుండు. నాకుఁ దగని వానిపై నాప్రేమ నేల శ్రీహరి పారఁజేయును? తగనివానినిఁ దమచేఁ జించి చెండాడం జేసెను గాని ప్రాఁతంద్రోఁసెనా? దైవబలమెన్నదరమా!

సీ॥ వలువలనూడ్చి ద్రౌ ♦ పదిని బరిభవింప
ధార్తరాష్ట్రులు చేరి ♦ ధన్యులైరె
దబ్బరలాడింపఁ ♦ దగుపాట్లఁబడెఁగాని
కౌశికుమాయలు ♦ వాసిఁగనెనె
శ్రీరాము పట్టాభి ♦ షేకార్ధమిడినట్టి
శుభముహూర్తమున న ♦ శుభము మూడె
ముల్లోకములలోన ♦ మ్రొక్కులందిన శౌరి
బోయని వింటిచే ♦ భువినిఁ బడఁడె
తే॥ గీ॥ బహుళబుద్ధియుఁ బ్రకటిత ♦ బాహుబలము
ధైర్య శౌర్య గుణాధిక ♦ దర్పములును
భోగములఁబాసి పడయుత ♦ పోబలంబు
దైవదత్తము లెదురునే? ♦ దైవబలము॥

కావున భగవదిచ్ఛానుసారంబుగఁ బ్రవర్తించితినని నే నమ్మి యున్న దాన.

ఉ॥ వేఁడెద దోసిలొగ్గి మన ♦ వింగ వినుమా దుఃగృతఘ్ను నేను

బుద్ధి— ... ... ... ... కా

పాడిన నాఁడె పల్కితి వి ♦ వాదముకల్గుట యేలబాల నీ
వాడిన వేడి కోల్వ్యధ మ ♦ దాశయ భంగ మనాదరంబుగా
దీమునకిన్ని సద్గుణము ♦ లేర్పడె సార్థకజన్మవోసుతా॥

ఉ॥ రూపవివేక ధీగుణ శి ♦ రోమణి వబ్బుటఁ గూర్పనెంచితిన్
భూపున కాలిగా గుణ వి ♦ భూషణఁ గూర్చు తలంపులందునన్
ఏపదమందఁ గాదు, వల ♦ దీవనఁ బోవునదెద్ది లేదు నీ
కే పతియో త్రిలోకింద్రునకు ♦ నింతియె భూస్థలిఁ జిక్కకుందురే॥

అమ్మాయీ! నే బోయి వచ్చెదను.

(బుద్ధిసాగరుఁడు వెడలిపోవును)

(తెరలో) అమ్మా! అమ్మగారు వచ్చుచున్నారు.

(బుద్ధిసాగరుని భార్య భాగ్యశ్రీ ప్రవేశించును)

భాగ్యశ్రీ—అమ్మాయీ! నాన్నగారు ముకుళితవదనులై తీవ్రగమనంబున నేగుచున్నా రేల?

చిత్ర—తల్లీ! దైవాజ్ఞచేఁ దండ్రి యాపితంబులకు వ్యతిరేక భావము వహింపఁ బూనికొంటి. అయ్యది మానసంబున కాయాసంబు గూర్చియుండు?

భాగ్య—బాలా! అదేది?

చిత్ర—వారు భూకాంతుని వరింపుమనిరి. నామనంబితరుని వశ్యమైనదంటిని.

భాగ్య—తల్లీ! నరేంద్రునే యొల్లనైతివా?

చిత్ర—ఔను.

భాగ్య—కారణమేమి?

చిత్ర—అన్యుని వలపునకుఁ బాత్రనగుట.

భాగ్య—ఆతండెవ్వఁడమ్మా? ఎచటివాఁడు? ఎపుడు వరించితివి?

చిత్ర—ఆతని నేనెఱుంగను. ఈగృహోన్ముఖులమగుసమయమున నీయావరణమునఁగల తోటలోని వృక్షములచాటున నిలిచిన పుణ్యమూర్తి యెవరో నామనోధనంబును ముచ్చిలివె,

భాగ్య—[ఇంచుక తడవాలోచించి] మావనముననా?

చిత్ర—వాస్తవముగ నిందే. మృష లేలపల్కుదు?

భాగ్య—ఎట్టివాఁడో వివరింపఁగలవా?

చిత్ర—మోముఁదమ్మిని మాత్రమే కదా కనంగల్గినది.

భాగ్య—అయ్యో! మీ యిరువురకు సమాగమ మెట్లు ప్రాప్తించు? ఆతఁడు నక్కి చూచిన దేలనో? వెతకుట కానవాల్లేమియును లేవా బాలా?

చిత్ర—అడవి యుసిరిక యంబుధి లవణమన్నట్లు హరి లగించియే మనసులఁ బెనఁగొనఁ జేసె. అమ్మా! వెతకించు టేల? ఆత్రమెందులకు? మనుజులకు మఱపు సహజమగుట యుద్బోధన లవసరము. సర్వవ్యాపియు, ప్రాణికోటి మనోవాక్కాయకర్మంబులకు మూలాధారుండును నగు చక్రికిఁ బరాకు లేల? నాపూర్వపుణ్యము పండిన నాఁడు నామనఃకాంతుని లక్ష్మీధవుండె చేర్చు. తల్లివగు నీకడఁ గనుమరుగేల? నాకుఁగల చిత్రకళానైపుణ్యము కొలఁది నా మనోనాథుని ముఖపద్మముఁ జిత్రించితి. వీక్షింపుఁడు [లేచిపోయి పటము తెచ్చియిచ్చును]

భాగ్య—[పుచ్చుకొని తేఱిపాఱఁ బలుసార్లు చూచుచు, తలపంకించుచు నవ్వును]. అమ్మాయీ! అందగానినే వరించితివి. తగిన వరు నెన్నుకొంటివి. శీఘ్రకాలంబున వివాహితులైన వధూవరులం దిలకించి కన్నులపండువగుడు సంతోషించెదము. మీబాబుగారికీపటమునుం జూపి యీవరు నన్వేషింపుమనెదవా? తడవేల?

చిత్ర—తల్లీ! వలదు వలదు. నాపటమును నాకిండు. నిక్కపుం బ్రేమం గలిసిన మనోహరుం డెన్ని దినములు కేల్వట్టక యుపేక్షసేయు? సైరించుటయే మేలు? తల్లీ! నాయందాగ్రహము వహించియున్న యెడల నాయనగారికి సర్వంబును విశదపఱచి మనసుం ద్రిప్పం దమరిని వేడుదాన. కానున్న రాణినని యింతటివైభవముల నిన్నిదినములు సపర్యలొనర్చితిరి. ఇందులకు వందనంబులు. ఱేపటినుండియు మీకుటుంబములో దానివలె జూచుకొనుఁడు.

[తెరలో] అమ్మా! పెదతల్లిగారూ! బాబుగారు పిలుచుచున్నారు.

భాగ్య—బిడ్డా! వింటివా? ఇరువుర మేగుదము రమ్ము.

[ఇరువురు వెడలుదురు]

[తెరవ్రాలును].

—* తృ తీ యాం క ము *—

## ద్వితీయరంగము.

[నిజమందిరమున దమనుఁడు పీఠముపైఁగూర్చుండి యుండును.]

దమ—నే నల్పసంతోషిని. నామంత్రము పారిన దనుకొంటిని. ఉబ్బితబ్బిబ్బు లైతిని. తండ్రికుమారులకు వైరకారణము లొదవించితికదా యని హర్షపులకిత శరీరుండనైతి. నాకుసాటి యెవరులు లేరని నేనుబ్బితబ్బిబ్బులగుట కాక్షణమున మదనుఁడెట్లునటించె! నిండుకుండ యగుటచేఁ దొణకకుండెను. పెనునమ్మక మొదవ బసవన్నవోలె మెండుగఁ దలఁద్రిప్పె. అమాయకుఁడనగుటచే నేనాతనినక్కజిత్తులని గ్రహింపక, దీర్ఘమంతనం బొనర్పక వ్యర్థప్రసంగంబొనర్చితి. కాసంతేని లాభింపదయ్యె. ఒండొరుల మనంబులు నెఱియుటకుఁగారము రాచితి నని మురిసితిని. నామన మాతనికి వెలిబుచ్చి నేవెఱ్ఱినైతి. మదను

నకు నాపోఁతప లేమాత్ర మిమడవయ్యె. గ్రామాంతరమేగుచున్న దంష్రిమాటల నొదలమోపి మారాడకఁబోయె. వారియాత్మలందు భేద మిసుమంతేని యేర్పడదయ్యె. ఆవులించినఁ బ్రేగులలెక్క వెట్టు సామర్థ్యముఁగల బుద్ధిసాగరుఁడు సామాన్యుఁడా?

తే॥ గీ॥ కాక యిసుమంత పెడత్రోవ ♦ రాకఁజూచి
మధురభాషల మదిఁద్రిప్ప ♦ మంత్రినేరు
పనుభవైక వేద్యంబయ్యె ♦ నాత్రపడి స
హజగుణముఁ జూపితే క్రోధ ♦ మతిశయింప॥

ఛీ! ఇదేటివెఱ్ఱి! నాకేమిలోపము? నాకును బుద్ధిసాగరునకును, అష్టమచంద్రుఁడు నైదవతారయేకదా.

ఉ॥ పుట్టిమునింగిన ట్లహర ♦ బుద్ధులె కారణమంచుఁ జింతిలం
గట్టుటె సేతుబంధనము ♦ గండిన నీరముచన్న పిమ్మటఁ
గట్టగఁ గట్టఁగట్టుకొని ♦ గ్రాలుచునుంటిమె మైత్రిభంగమే
పెట్టిన చిచ్చుమండ నొక ♦ పీవనతో విసరంగఁజెల్లదే॥

తే॥ గీ॥ ఆరఁబోవు దివ్వెవెలుఁగ ♦ నాముదంబుఁ
జేర్చునట్లె సమిధలను ♦ చేర్చి క్రోధ
వహ్నిరగుల శక్తికొలఁది ♦ పాటుపడుదు
త్రొక్కువడినట్టి పామునై ♦ రోషమూని॥

బుద్ధిసాగరునికిఁ జాలనిగ్రహముల కూటమి యగువరకును నా ప్రయత్నములు ఫలోన్ముఖతఁ గాంచనేరవు. ఆతని వశీకరణశక్తి యమోఘము.

ఉ॥ ఱేనికిఁ బ్రాణమై తగిన ♦ రీతిని నిచ్చకమాడనేర్చి భూ
జానిని బుట్టవైచుకొన ♦ సాహసమూర్తియె బుద్ధిసాగరుం
డౌ, నిరతానుమోదినయి ♦ హాసవిలాస విధానువర్తినై
కానుక మెచ్చు భూధవుఁడు ♦ గాని నుతించును నాతనిన్ సదా॥

[తెరలో] దేవరవారికి పాదసేవకుఁడు నమస్కారములు.

దమ—పారి పార్శ్వకా! విశేషమేమి?

[తెరలో] స్వామీ! నవాబు సయ్యదహమ్మదుఖానుసత్తముఁడు విజయముచేసి తమదర్శనార్థము వాకిట వేచియున్నారు.

దమ—సేవకా! వారిని సత్వరముగ నిందుఁ జేర్పుము.

[నవాబు సయ్యదుఖానుఁడు ప్రవేశించును]

దమ—(లేచి ఎదురేగి) బాల్యమిత్రమా! నవాబా! సలాము. (ఉచితాసనమును జూపి) ఈ యాసనము నలంకరింపుము.

నవాబు—అచ్ఛా. సలాం. దమక్ భాయిగారూ! తుమారాముఖం మీాద కులాసా హక్పడటంలేదు. ఏం? నాకీ ఎంకుక్ రా చెప్పావ్?

దమ—మిత్రమా! దీర్ఘాలోచనయందుండుటచే నీకట్లు తోచియుండు.

నవాబు—హేం మాటల నీకీ తిన్నావు వా. అబీచి మేం బుద్ధిసాగర్ సూషేం. ఆ చమక్, ఆ చలక్, ఆ కులాసా మారింది లేదుగా? ఆయనాకీలేని ఫర్, దిగుల్ యోచింపింపటం మీాకీఉందీయేం?

దమ—సఖా! నీవేల కృశించినట్లున్నావు?

నవా—అరే! ఖల్లా. అయ్యల్ మియ్యల్ హేకం ఉండాలే అన్నంటంలో మాకీ హెండ్జోర్ పోతున్నాం. జీవాహింసా వద్దు సెప్పి మా మాంసం నోట మట్టిగొట్టార్. మత్తుపదారదం సారా సిక్కకుండా సేపించార్. మదం పోయాతో నున్నీకి క్యాహై!

దమ—ఔను! సాత్వికాహారమే మంచిది.

నవా—నీకీ ఏం హఁాను! సెప్పామల్లీ మేరావాలా జాత్ జాతీహై మావాల్లపాణం ఎల్లిపోతార్ గ్యావై.

దమ—పాపము! కొంచెము సారాయి తెప్పించమందువా? కుతిఁదీరఁ గ్రోలెదవు గాక.

నవా—అరే క్యాబాత్ హై. మాకీ నకో చెప్పటం. మీా యింటిమే ఉంచుకొని జర్దాజర్దా పుచ్చుకోటం తిన్పించడం! ఖ్యారే? భాయి? మరంనై మీాకి? బుద్ధిసాగర్కే బుద్ధి బడావుంది. నీకీనీమం తాగుడ్కీ మానాలా. తాగుడ్కీ మానాలా. మాంసము తిన్పించటం వద్దు. మాంసం తిన్పిచటంవద్దు. క్యా త్తావఖత్ ఆయనగారు క్రోధనం

యిన్పించారు. నివు మట్టీ మహాణాం చెప్తుంది ఏమండీ? లుచ్చాకూతు మాకీతింటాం? మాకీమాట వ్రెక్కి, పనిబక్కి. మాటఅనటం మళ్లీతిర్గటం?

దమ—నీమనోదార్ఢ్యముఁ గనుగొంటకే యిట్లంటి.

నవాబు—అరే! మేరే భల్లా ఎంతావాడ్ నీకీ! [నవ్వును] తప్సీల్మాటాకీ తక్రార్ కారణం అన్కోన్నాం. మా కీ మాకీ తెల్వాదన్కానా వేం. మేరాపాస్ యే హాబ్బీజాంతాన్లై. ఏకీచ్ బాత్ మీాద ఉండు అని లోకుల్కి చెప్పాటం, మీాలో మీాకీ యిరోధం. వహారే. వహ్వా బల్ నాయముపుందిగా!

దమ—సాహెబా! నీవును నేనును బుద్ధిసాగరుఁడును యిప్పటి వారము కాము. తదితరులవోలె నీవును విషయసరళిల మొనర్పక యాత్ర పడకుము.

ఉ॥ సోదర భావమూని పరి ♦ శోధనఁజేయుము భావవైఖరుల్
నాదురితంబులాతని ఘ ♦ నంబులు వేవివరించి తెల్పుమా
గాదిలి మాటలట్ల బరుల ♦ కన్నులు మూయు, ప్రతాపశాలియే
మేదినిబూజ్యుఁడౌను నను ♦ మెత్తురె లోకులమాయికుల్గదా॥

తే॥ గీ॥ ఇరుపుర మమాత్యులమె కద ♦ పౌరుపుత్రేల
కార్యనిర్వహణంబునఁ ♦ గెల్వుకోలు
తగదె, గుసగుసలేల భూ ♦ ధవునితోన
ను విడనాడి స్వోత్కర్ష యు ♦ నూనమగునె?

రాజ్యపరిపాలన విషయముల యందేగాక ప్రభుని స్వకీయముల యెడఁగూడ దల నిరికించుచు ప్రాముఖ్యము వహింపనెంచును. అట్లొనర్చిన యాతనితో జేతులుగలుపుకొను యోచన లేల? ఈతడు పూసికొని తిరుగుచుండుటచే తేసికి విశ్వాసముండక పోదు. నే నట్లొనర్పమి నాయం దసూయ స్వభావికముగ నుండునుగదా? ఇట్టిదానికి బుద్ధిసాగరుఁడు కారణముండువా?

సాహెబు—వహో లేఅయ్యా హూ లే? ఎత్నా బాతా హైకూ భయ్యా. బుద్ధిసాగర్ గారు గులాంగిరీకి తర్భీతైనారు అన్నమాట.

తే॥ గీ॥ తండ్రి వీక్షింప యత్నముల్ ♦ దగ్ధమగు న
నడి భయమున నాఁ డీయింతి ♦ నెమ్మొగంబు
తనివిఁదీఱఁగఁ దిలకింపఁ, ♦ దడవి కేల
పూర్ణదృష్టులఁ బిగిడించి ♦ పోలఁతిఁ గాంతు॥

ఔరా! ఈ లతాంగి సుకుమార సౌభాగ్యసంపద లేమని వర్ణింపనౌను.

చ॥ మనుజవిలాసినీ మణుల ♦ మంగళరూపము లిట్టులుండునే,
అనిమిష కాంత యేమియును ♦ రాగమహాకీలల కింధనంబునై
జననమునొందె నిక్కడమిఁ ♦ జక్కఁదనంబనఁజాలు, మోహవా
ర్ధి నను మునుంగనీయక త ♦ రింపఁగఁ జేసెడు తెప్పయో యనన్॥

నిదురమేల్కొనుచున్న నాప్రాణప్రియావాక్సుధలాన నిందె వేచియుందుఁగాక. చెలికత్తెవద్దనుండి గ్రహించిన యీ నాచిత్తరువు మూలమున వలవాఁటి నాదోహదము భగవదిచ్ఛానుసారంబుగ నభివృద్ధియై యొండొరులఁ బెనఁగొనినయట్లు ప్రబల నిదర్శనంబయ్యె. ఇఁక నే ధైర్యమువహించి యుండనగు. దైవము నాపాలనుండి నానిశ్చలప్రేమ కాస్పదంబగు కన్యకామణిని మదీయాభిమతాను సారంబుగ నాకుంగూర్చె. నామురిపెముల మూట లేవనుంకించు చున్నది. ఇందొదిగి విశేషంబు లరసెద.

చిత్ర—(లేచి కూర్చుండి) చెలీ! చెలీ! ఎందేగితివమ్మా? నా పెన్నిధి నెందిడి పోయితి? (లేచినిలిచి కలయ వెదకి) అయ్యో! ఇందెందును గాన రాదే. క్షణమేని నెడఁబాయక వక్షస్స్థలంబున నిలుపుకొని మనస్సు నకు ధైర్యమును జెప్పుకొనుచు గంపెఁడాశతో నుంటిని. నేనద్దాని గోల్పోవుట యశుభము. వరులకంటఁ బడుటయే మోసముగూర్చె. కాకినోటఁగడ్డకొట్టి గద్దకిడినట్లు, తల్లి కాపట మాఁనాఁ డొసంగక దీని పొట్టంబెట్టుకొంటి. నా మనోనాథుఁడెవండో దీనిమూలమున వినంగోరు నుద్దేశమే మహాపరాధము. ఇన్నాళ్లు వేచియున్నదాన, నేనేల తీవ్రపడి బయలుపడితి? మది చలించినపుడెల్ల త్వదీయవద

నాంబుజముపై దృష్టులం బాఱఁజేయుచుఁ గనులకద్దుకొనుచు నశ్రులరాల్చుచు, నేనాఁటికిఁ ద్వదంఘ్రుల కుపచరించు భాగ్యమబ్బునా, పైపైకిదుఃఖము మాఱుఁ దూలింతునా, యని విన్నవించుకొనుచుండెడిదానను. చిత్రఫలకమా నేనెట్టి యకృత్యమొనర్చితి? నాపైనలుక పొడమనేల? నిజేశురూప ప్రతిబింబమును స్పృష్టించుకొని పతిప్రత్యక్షమగు దనుక ముచ్చటలాడుచుఁ గాలంబుగడుపఁ దలఁచియుంటి. చెలీ! చెలీ! శారదా! ఎన్నిమార్లు పిలిచినను బలుకవేమే? లాలించి బుజ్జగించి మృషలాడి, నారహస్యం బెఱింగి నామోహనాకారు రూపపటము గ్రహించి నన్నేమిచేయుదువే? నీ నీచబుద్ధియే వెలువడియె. నాకుఁ బనినిగల్పించినదానవైతివి. ఇది నాకుశ్రమ యనుకొంటివా? ఉత్తరక్షణంబుననుఁ జిత్రించి సిద్ధమొనర్చి ద్రోహము సైరింపుమని యంజలిఘటించి మ్రొక్కయుచితరీతి మనఃపీఠి నిల్పి పూజించెదఁగాక.

(మదనుఁడు ప్రవేశించి స్వగతము)

ఈమగువ వినయాది సద్గుణసంపద లసమానంబులనం జెల్లదే? నేనింక నామె సాన్నిధ్యముఁ జేరక యొదిగియుండఁజాల. ఈకాలయాపన మెట్టి యనర్థముల కాలవాలమగునో? ఐన నిట్లొనర్చెద. (తనవద్దఁగల చిత్రఫలకమును, ఆమెవైపునకు విసరును)

చిత్ర—(పటమునందుకొని కనులకద్దుకొని) నాథా! నన్నీవిడి యెచటకేగితివి? నన్నాసితివని నామనఃఖేద మేమందును? ఈయశ్రులధారలే నిదర్శనములు. చెలీ! నానిక్కంపు ప్రేమ న్పరీక్షించుట కిట్లొనర్చితివా? పరీక్షాఫలితంబులఁ జేర్కొన నేల ప్రసన్నవుగావు? ఈ దాగుడుమూఁత లాటలేల? నేనెవచ్చెదఁగాక. (ఆ దిశఁబోయి చెలిగాకుంట దిగ్భ్రమనొంది నాల్గడుగులు వెనుకకువైచి మ్రాన్పడి నిలిచియుండును).

(మదనుఁడు ప్రవేశించును)

మద—కన్యారత్నమా! ఏల బెగడొందెదవు?

చిత్ర—(స్వగతము) పురుషుఁడొకఁడు ప్రవేశించె ననుట ధ్రువము. బుద్ధిసాగరుం డనిన రాజవతంసుఁడే బలిమిని నన్గవయఁ బ్రవేశించె నేమో? ఏది దారి? ఎట్టియప్రతిష్ఠల పాల్పడవలసియున్నానోకదా. అతండు నిలచియున్న వైపునుండియే నానాథుని చిత్రఫలకము నన్జేరె. నిస్సంశయముగ నీతండే దానిని విసరియుండును. నాప్రసంగము నాలకించి ధైర్యముతో నీతండిందుండి వెడలకుంటయే మనో నిశ్చితమును కార్యదీక్షయు విశదమయ్యెడి. అయ్యో! నాపాపి గ్రహమా! బుద్ధిసాగరున కిట్టిబుద్ధి నేల పుట్టించితివి? అతని యంగీకారమును బడయకయే నీతులువ యిటకడుగిడఁగలఁడా? బుద్ధిసాగరుని దూరు టన్యాయము. ఇన్నిదినములు నన్నాతని పాల్పడకుండ నాఁచఁగలై. ఈయుదంత మంతయు నేరిమూలముననో నాదురదృష్ట వశమున రాజేంద్రుని వీనులంబడ నాతం డిందు జేరియుండనోపు. సచివోత్తమునిందూరుట పాపకార్యము. దైవమా! నీవే నాకు శరణ్యమవు. నిన్నే నమ్మినదాన. అడ్డుపడువా రేరును లేరు. (తలవాంచి బహిరంగముగ) ఆర్యా! కాంతాజనాంతికంబులకుఁ బురుషులు రాఁజెల్లునే? అందునే నీయింటివారి యవ్యాజకరుణచే నభిమానపుత్రికగఁ బరిగణింపఁబడుచుఁ బెరుగుచున్న దాన. తమరిట్లొనర్చుట నాపురోవృద్ధికి భంగకరము. తమరు విసరిన చిత్రఫలకంబునఁ జిత్రింపఁబడిన యాతఁడే నామనఃకాంతుఁడు. మహాపురుషా! అతనిఁదక్క నేనన్యుల ముఖావలోకనం బొనర్పనొల్ల. మహనీయా! ఇయ్యది తమహస్తగతం బెట్లయ్యె?

మద—మీచెలియొసఁగె.

చిత్ర—మనఃపూర్వకంబుగ నొసంగెనా?

మద—బలాత్కారంబుగ నిప్పించుకొంటి.

చిత్ర—ఆయమ యొందేగె?

మద—నేనిందుండి వెడలఁదగిమితి. ఇపు డాపె చింతయేల? శ్రద్ధాళువవై నాపల్కు లాలకింపుము.

తే॥ గీ॥ అసమశరుడేచు విరహాదా • వాగ్నిఁ బాపు
చల్లనౌనీదుచూపు ని • శ్చలతఁ బఱుపు
శీతకిరణాళి నను నింపు • నూతనంపు
శశిని నినుదాల్చియాడు నే • చంద్రమౌళి॥

చిత్ర—శంకరుఁడౌట యెటులునున్నను తలతిక్క శంకరయ్యవైతివి. కుసుమశరంబులకే సహింపలేని సుకుమారుఁడవు. జముని క్రూరపు శూలంపుఁ బోట్లకెట్లాఁగఁ గలవు?

సీ॥ పంచశరునెదిర్చి • వంచింపనేరవు
పడఁతుల వంచించి • పట్టఁగలవె
విరహాదావాగ్నికే • బీరంబులుడిగెఁగా
కులకాంత శాపాగ్ని • నిలువఁ గలవె
ఈశ్వర దత్తమౌ • నింగితంబేపోవ
మూర్ధంబుపైఁ గ్రొత్త • మోఁతయేల
ఉన్నకళలతోడ • నుబ్బూఁతలూఁగెదు
కళలకు నిధివిగా • గతులుకలవె
తే॥ గీ॥ మాటకును మాటతెగులను • మాటవినవె
నీటికిని బాచితెగులను • నీతిగనవె
వినఁగఁజెప్పితి నామనో • భీష్టమెల్ల
వాదమునువీడి వెడల భా • వ్యమ్ముసుమ్ము॥

మద—కాంతామణీ! ఏమి నీకిన్నరగాన మాధుర్యము!

చిత్ర—వాఙ్మాధుర్యముఁ గ్రోలి యుబ్బి తబ్బిబ్బులగుచుంటివిగాని అర్థగాంభీర్యము నజ్ఞానివై చవిగొనలేకున్నావు. మోటుతనమేల? నిన్ను వలచిననాతికడ నీనేర్పుచూపి శ్రమపడిన నీప్సితార్థంబు నెఱవేఱును. వలదుపొమ్ము. దేవుఁడాయను నాకడ నీయుపాధ్యాయత్వమేల? ఈవిరాగిమెడ నీకేల యనురాగము? దయయుంచి తరలుము.

మద—(స్వగతము) అయ్యో! ఇదేటిపాపము? నే నొకటి దలఁచిన దైవము మఱొకటి దలఁచినట్లున్నది. నాసాధనలన్నియు వక్రగతుల నొప్పుచున్నవి. ప్రవేశించిన వెంటనే సాక్షాత్కరింపక నూతన మార్గ మేల ద్రొక్కితి?

తే॥ గీ॥ కాంత యేకాంతముగ నుండఁ • జెంతఁ జేరి
శీతలోపచారంబుల • సేదఁ దీర్ప
కేల కొఱమాలిన పరీక్ష • లింతిపొందు
దూరముగఁ జేసె మది నెంత • దూఱుకొందు.

(ప్రకాశముగ)

ఉ॥ మాను విచారమో యబల • మంత్రిసుతు న్మదనాఖ్యుఁగా ననున్
ఆననమెత్తి గుర్తుఁ గొనవా; భవ • దాత్మబలంబు, ప్రేమయుం
గానని యీ జగానఁబర • కాంతల మానసవీథులందు; భా
మా! నిను కుత్సితుండనయి • మత్తిలి యాసఁ బెట్టితిం జుమీ!

చిత్ర—(స్వగతము)

తే॥ గీ॥ ఔదు నవిడి మనఃకాంతుఁ • డౌను కాఁడొ
మోసగించంగఁ జేరిన • భ్రమ చొచ్చి యితఁడు;
కాంతుఁ గాక న్యునింగనఁ • గలుషమబ్బు
ముంచుకొనిపోయిన నాయిపి • యుంచ గోయి॥

ఉ॥ ఓ పరమాత్మ! తోఁచదెటు • లుత్తరకార్యవిధానపుంగతుల్
నాపతి యేనొ కాఁడొ! కన • నా! వలదా! పెఱవానిఁ గాంచుటల్
పాపపుఁ గార్యమై వెలయు • భర్తయె యైన ననంప్రదాయమా
నాపతి నాత్మ నిల్పి చర • ణద్వయి నెన్నుచుఁ జూతు నీతనిన్॥

(మదనుఁ డందున్న నిలువుటద్దము కడ దిద్దుకొనఁ జేరఁ బోవుచుండును)

చిత్ర—(ఆవిధముఁ గ్రీకంటం గాంచి మెల్లన వెనువెంట వెన్నంటి తాను గానరాకుండ నందాతనిం గాంచి నిక్కముగ నితఁడు నాపతియే యనుచుఁ జివాలునఁ బాదములపైఁబడి)

నాథా! నాతప్పుల సైరింపుము. ప్రల్లదంబులాడితి. అమర్యాదగఁ బ్రవర్తించితి. ముంజేతి కంకణంబున కద్దమేల? సర్వమును దమ సమక్షముననే తటస్థించినదిగాన దండింపుఁడు, మందలింపుఁడు. క్షమించితిరి నన్నుఁగాని పాదంబులు వీడువను.

మద—(లేలెమ్ము కాంతా) నీమనోధైర్యము, అకళంక ప్రేమ యచ్చెరు వొందించెడి. నీసందియముఁ బాప మున్ముందు నే నీబుద్ధిసాగరుని పుత్రుఁడనని తెల్పుకొనుటవసరము. రాసుతునకై తండ్రి తెచ్చిన మన్మథురాణివగు నిన్నుఁ దరుమూలములమాటున దాఁగి తిలకించి యమాయకురాలవుగ నిన్నింత నలయించిన యపరాధి యితఁడె. నాకై విలపించితి, యుద్రేకం గాంచితి, మోహాతిరేకంబున నాపటంబునే నన్నుగా భ్రమసి ముద్దాడితి, నక్కునఁ జేర్చుకొంటి, వక్షస్థలింజేర్చితి, అయ్యెభాగంబులా కఠినఫలకస్పర్శనంబున శోభ చెడి యుండు. ఇంతీ! నాతప్పు లసంఖ్యాకంబులు. శిక్ష నీచిత్తము, నాప్రాప్తము.

చిత్ర—(చిఱునవ్వు నవ్వుచు) మీ తల్లిగారి సందేహవాక్యంబులే యథార్థంబులయ్యె. కరుణమీఱం బెంచుచున్న వారలకుఁ బాదసేవకురాలనై యుపచరించు భాగ్యము శ్రీహరికూర్చినందులకుఁ బరమానందమయ్యె.

మద—ప్రేయసీ! తల్లి ఏమనియె?

చిత్ర—(సిగ్గునఁ దలవంచి) అందగానినే వరియించితివి. దంపతులఁ గాంచి సంతోషించు భాగ్య మెప్పుడేయని నేఁజూపిన మీపటముం జూచుచు ముసి ముసి నవ్వులు నవ్వుచు నుడివిరి.

మద—తథాఽస్తు. ఆపె మాటప్రకార మొనర్తము. ఆలస్య మేల?

ఉ॥ అంగముఁ దూలఁజేసెడి • యనంగుఁడనం; జెలినొచ్చె నెమ్మనం
బంగజుఁడేపురోధ విర • హాగ్నియె సాక్ష్యము పాణిసందఁ, ద

న్వంగిరో, చిత్తజల్లాయన ♦ సంబకముల్వ్రిదళించుమాఱు, స్రు
క్కంగనఁ బంతమూనుచు ని ♦ కామముగాఁ జరియింపఁ దగ్గునా॥

(ఇరువురును లోనికిఁ బోవుదురు.)

(తెర వ్రాలును.)



## —* తృతీయాంకము *—

(పంచమరంగము.)

బుద్ధిసాగరుని మందిరము.

[బుద్ధిసాగరుఁడు—ధూర్తుఁడై కృపాణముఁ దాల్చి పద్యము చదువుచుఁ బ్రవేశించును.]

బుద్ధి—

ఉ॥ ఓరి దురాత్మ! ఘోరకలు ♦ షోదధిముంచి మదన్వయంపుఁ జే
రూపుల మాపఁగా జనన ♦ మొదితె కావలిగాఁచు భూమలన్
దూరముదోలి యంతిపురి ♦ దూరితె కామమదాంధకారివై
క్రూరత; వంటఁబల్లవియు ♦ కుందెలు వైతివిఁ దక్కనేర్తువే?

కులము కూఁకటివేళ్ళతో జెఱుపంబుట్టిన చీడపురుగా! మదన్వయంబున కపయశస్సు గూర్చుట కీవెక్కడ దాపరించితివి? నా సంరక్షణయందున్న కన్యకామణిం గవయఁజేరుట దుష్టకృత్యమనియు వావిని సోదరియగు ననియు మదనపిశాచగ్రస్తుఁడ వౌటఁ జిత్తభ్రమమదోఁపఁజేయదు కాఁబోలు. పరమకిరాతకుఁడా! వినినవారుమియు కార్యమొనర్చితివి గదరా.

మ॥ కరవాలంబునఁ గండ కండలుగ నిన్ ♦ ఖండింతుఁ; ద్వన్మాంసముల్
వటుడుల్ శ్వానములారగించు; రుధిరా ♦ ప్లావంబునన్గాని నేఁ
దరియింపన్; బితరుల్ సహింపునురే; హాం♦ తారమ్మ్టుల్ వైళమే
దురమందీ వెదిరించి తున్మఁగడు సం ♦ తోషంబు పంచత్వమేన్!

ఈ ద్వారంబుననుండియే యాతఁడు వెలువడవలయును. నాకన్నుఁ బ్రేవేటు తప్పించుకొని యెట్లుపోవునో చూచెదఁగాక. లేక నాభృత్యులు మృషలువల్కిరా? ఏఁడీ. ఇందెందు. నాదుష్టబుద్ధి కానరాఁడే. భీకరకంఠారవంబున నేనఱచినను బదులాడఁడుగా. కాముకుఁడైన కారణంబున మదిచలించి దాసదాసీజనంబు లనృతంబులాడిరేమో యని యనుమానించుచున్నాను. ఆహా! ఏమినాతెలివి! ఆరంభము ననే పెడదారిఁద్రొక్కిన భ్రష్టునిసేతలయెడ నమ్మకమా! భక్తిశ్రద్ధలతో సంచరించుచున్న యనుచరులయెడ విశ్వాసమా? వాడింతటి కార్యమాచరించియే యిందు నక్కియుండును. ఇంచుక వేచి చూచెదఁగాక

(అనుచు నిటునటు దిరుగుచుండును)

(హర్మ్యాంతర భాగంబున నిలిచి మదనుఁడు చిత్రరేఖయు వినుచుందురు).

మద—సతీ! నేనిందుఁ జేరి నిస్సరించుట మత్పిత కెట్టికట్టలుకంగూర్చెనో విశదమయ్యెనా?

చిత్ర—(గజగజవడఁకుచు) నాథా! ఏదిదారి?

మద—లలనారత్నమా! ఏలకంపితశరీరవయ్యెదవు? ఇందేనెఱుంగనిదేదియులేదు. జనకునాగ్రహంబునకు బాల్పడసిద్ధపడియే యుంటిని. మదనజ్వరతాపంబునఁ గన్నులలోఁ బ్రాణములుంచుకొని కృశించుచు నీపైనాసలు నిగిడించుచు నోటవేలువేసికొనిజీవించుటకన్నఁ దండ్రియాజ్ఞల మీఱి యునురులఁ గోల్పోవనైన సర్వసన్నద్ధుఁడనై యింతసాహసం బొనర్చితి. సఫలీకృత మనోరథుండనైతి. నాయనగారు చంపనుండె చావనుండె బ్రతినఁ బూనియున్నారు. నాయది దుశ్శీలమా నా? కాదా? యను సంశయము వేలు. వారినీమంబును మించిచరించితినసుటలో నణుమాత్రమేని సందియము లేదు. పిత్రాజ్ఞాతిరస్కారరాపరాధమొనర్చినీదుష్కృత్యంబున కేసద్గతికిఁదప్పినవాఁడనైతిగా

యను పశ్చాత్తాపంబునఁ బొగులుచు బైసిమాలి తగుదునని తల యెత్తి యసినిఁబూని యీ నీచఁపు టసువులం గాచుకొన యుద్ధసన్న ద్ధుఁడ నగుటయా? ఇంత కొఱమాలినవని వేఱొం డుండఁబోవునా?

చిత్ర—నాథా! నాకై రహస్యముగ మందిర ప్రవేశ మొనర్చినట్లును, తనుత్యాగంబునకైన నొడిగట్టి మదనోత్సవంబున నన్నుఁ దేల్చ నుంకించినదియుఁ జెవిసోకిన నభ్యంతరముఁ బేర్కొనియుందు. మాటునఁడాగి నా మనోనిశ్చయం బెఱింగిన వా రంతటఁ బోయి పెద్దల యంగీకారము వడసిన పిమ్మట వివాహితులమై యుండవల సినది. అత్రపడితివి.

మద—ప్రేయసీ! ఇదేటివెఱ్ఱి? మనల నాత్రపడఁ జేసినవి మన యంత రాత్మలు. ప్రోద్బలము భగవంతునిది. నా చేతిలోసిద్దైన నింతటి విరామమున కేల యోర్తును? సుదతీ! పంటిబిగింపున ననుచున్న వాడనే గాని హృదయము తత్తరం బడుచున్నది. తండ్రి పిలువ పంపిన పిమ్మట నిటనిచియుంట యప్రస్తుతము. రోష కషాయిత నేత్రుండై మండిపడుచున్న జనకుండు నేను తడవొనర్చిన, హర్మ్యంబే చేరవచ్చు. "ఇనుము వల్ల నగ్నికి సమ్మెట పె"ట్టన్నట్లు నామూలమున నీకు వెతలు సంప్రాప్త మయ్యెంగదే. తరుణీ! ఆనాడు దమనుని దుర్బోధవలన వేచియుండి నేను నీముఖారవింద సందర్శనం బొనర్ప నాపాడుబుద్ధి నన్నేల ప్రోద్బలం బఱచె? ప్రేయసీ! ఎంతలో మనకు ఋణములు తీరిపోయెనే. తండ్రి కృపాణము నా యసురు లందుకొన సంసిద్ధమై యెదురుచూచుచున్నది. నాజీవితముపైనాశ హుళక్కి. చానా! నిన్ను కామించి వరించుటలో నే నప్రయోజక కార్య మొనరించితి ననియే తలంపవలయు. స్వీయరక్షణ మొనర్చు కొన శక్తియుక్తుండ నౌదునా కానా యని మంతనం బొనర్పకయే నినుఁగూడ రంగంబునకుం దించితి. "తాఁజెడ్డకోఁతి వనమెల్లఁజెఱిచె" ననులోకోక్తికి నేనే తార్కాణము. నేను గడుంగడు దూష్యుండగు

పాపకృత్య మొనరించినవాఁడ. అయ్యో! యెంత ఘోర మెంత ఘోరము! అన్నము పున్న మెఱుఁగని నిన్ను మోహాంబుధిం ద్రోసి నీయుచ్ఛస్థితి కంతయు మారక గ్రహంబునైతి. ఈ శని గ్రహమును నీవు ప్రారంభమున విలోకించకున్న యెడల సుదర్శన భూధవున కిల్లాలవై సౌఖ్యాంబుధిం దేలుచుండెడి దానవుగదా. ఈనిర్భాగ్యుని మూలమున "రెంటికిం జెడ్డరేవడ" వన్నట్లైతివి.

చిత్ర—నాథా! తమ రేల నాదుస్థితికై వగచెదరు? పతివ్రతకు వల్లభుని కన్న దైవము లేఁడు. తమ రేగిన పిదప నీ జీవి యుర్వీస్థలిని మనఁ బోదు. మన జంటను విడదీయ నొల్లకఁ బరాత్పరుఁడు సంరక్షించిన నుభయుల మిందుందము. లేకున్న స్వర్గలోకముననే మోదావహులమై యుందము. నాథా! ఇం కేటికి? మామగారిపాదసరసీరుహంబులపై వ్రాలి పతి భిక్షఁ బెట్టుమని వేఁడుదాన.

మద—నాతీ! నీయనుపమానప్రేమ కే సలఁతి. భార్యామూలకంబుగఁ బ్రాణంబులు దక్కించుకొనె నను నపవాదమును నే భరింపఁ జాల. అయ్యది యశాస్త్రీయము. వలదువలదు. అట్టి ప్రయత్న ముడుగుము. ఇంతియె కాదు. నాతోడం గూడ మత్పిత్రు సందర్శనంబునకు నీవు చను టే నొల్ల.

చిత్ర—ఏల! ఏల! ఆమాట యేల!

మద—ఇంతటి యాగ్రహంబున నున్న మజ్జనకుండు మన యిరువురము ప్రత్యక్షము కాఁగనే, కూఁతా! జాలిఁ బుట్టింప నమాయకురాలిఁ దోడ్తెచ్చుకొంటివా? యనకఁ దప్పఁడు. ఇచ్చకములాడకు; మరణ మనుకొనిన నంతటి సులభకార్యము కాదు. అందులో బలవన్మరణము మఱియు హింసాకార్యము. భర్త మరణానంతరము భార్య మనవచ్చును. చరింపఁదగు నిష్ఠలు గలవు. ఇదిగో మదీయ కరవాలము. ఆలోచించుకొని యవసరమైన నుపయోగించుకొనుము. ఇందే నిలిచి సర్వంబు వీక్షింపుచుండుము.

బుద్ధి—ఔరా! ఏమి! యింత యాలస్యమైనను నీచుఁడు వెలువడఁడయ్యె! నా భయమున నందే నక్కియుండు నట్లున్నది. ఆగారమునుండి బలవ దుత్తరణంబునకు నవకాశము గల్పించునట్లున్నది.

ఓరీ దురాత్మ.................

కరవాలం.........

(రెండు పద్యములం దిరుగ చదువును.)

మద—సఖీ! తండ్రిగారి హెచ్చరికలు వినవయ్యెడి. నా మురిపెంబుల నిధీ! నీభావిసౌఖ్యంబులకన్న నాక్షణసుఖమే మిన్నగనెంచి అత్యంత దుఃఖకరంబగు నిరంతర వైధవ్యంబును బొందనున్నావు. ఇంతీ! పోయి వత్తునా? అయ్యో! పోవుటయు వచ్చుటయునా! కాలవ్యాళ మట్లు నోరు తెఱచుకొని తళుకుతళుక్కుమని మెఱయుచున్న జనకుని కరగతంబగు ఘోర ఖడ్గంబున విగతఁ జీవుఁడనగుటయే కదా! కలికీ! కన్నుల నీరు నించకు. ఇదేమిచిత్రము! ముంగున కడుగిడఁ బాదము బల వంతముగ నెత్తినను పాఁకొనిపోవుచున్నది. కారణము మృత్యువు వాతంబడనున్నా నను భయమా! యువతీ! వ్యామోహ పాశంబులఁ జిక్కి తెప్పరిలలేకపోవుటయా! రెండును భవిష్య దుద్యమంబునకు భంగకరంబులే. భయమా! నన్వీడిపొమ్ము. మోహమా! ఈదంప తులకడ నీకిఁక స్థానములేదు. రమణీమణీ!

సీ॥ కడసారి చూపులే ♦ కనమొండొరుల నింక
యీ జన్మమునకింతే ♦ యిందువదన
చిత్ర—అటులేల యనుట మా ♦ మయ్యగారికి మది
మారంగ రాదె మీ ♦ మాటపైన
మద—పేరాస లేల యా ♦ వేశపూరితుఁడగు
పితమది తిరుగదు ♦ విదిత మతిప
చిత్ర—మన ఖేదమును జూచి ♦ మనుపరి దయనెంచ
మామగారిని శాంత ♦ మతినిఁ జేయు

మద— తే॥ గీ॥ ఆత్మపారిశుద్ధ్యము! నను ♦ నాదుకొనుము
చిత్ర— నాపతివ్రతాత్వము! రావె! ♦ చూపఁగరుణ
మద— పోక విధిలేక చాన నే ♦ పోవుచుంటి
చిత్ర— సహచరిణినయ్యు వలదన ♦ సాగకుంటి॥

(మదనుఁడు వెడలిపోవును)

(చిత్రరేఖ కంట నీరుగార్చుచు నిలిచియుండును.)

చిత్ర—

తే॥ గీ॥ జనకుఁడు బాయఁ బాప సం ♦ చయము కతము
నవ్వుచుఁ జేసి ఫలమంద ♦ నవయఁ దగునె
తప్పఁ బోవదు నీడ నాఁ ♦ దగిలియుండు
నీసడించి చరింపఁగా ♦ నెవరితరము॥

(తెరలో)

అమాత్యశేఖరునకు వందనములు. తల్లిగారు దర్శన మపేక్షించుచున్నారు.

బుద్ధి— సేవకా! దర్శన మలభ్యమనుము. ఇంత యాగడంబునకు నా యిల్లాలి ప్రమత్తతయే కారణమో లేక కొడుకునకై యిట్లు మెలఁగెనో, స్త్రీలకు రహస్యంబులఁ దెలిపి నమ్మియుండుట నా దోషము.

(మదనుఁడు ప్రవేశించును.)

మద— తండ్రిగారి పదకమలంబులకు వందనంబులు.

(పదములంటఁ బోవును.)

బుద్ధి— ఛీ! దుండగీఁడా! నాపదముల నపవిత్రము లొనర్పకుము. ఆవల నిలుపుము.

## తృతీయాంకము.

మద—చిత్తము దూరముగ నిలిచి యుండెదను. (అట్లొనర్చును.)

బుద్ధి—ప్రతిన నాలకించితివా?

మద—చెవులార వింటిని.

బుద్ధి—నిరాయుధుఁడవై ప్రవేశించితివే. ముష్టియుద్ధంబునకుఁ గడఁగుదువా?

మద—తమ్మునుఁ బ్రతిఘటించు దురుద్దేశమునఁ జేరలేను.

బుద్ధి—కృపాణమునకు నసురుల నప్పగింతువా? దుస్తర సహనమెట్లు వహింతువు? మరణమునకు సహింప నెంచినవానికి మారుని కరకుటమ్ములు దుస్సాధ్యములైనవిగా! ప్రశాంతసత్త్వమును వహించి నట్లు క్రిందిచూపులు, ప్రియభాషణములు, నమ్రత నన్నో్మన గించి జీవములఁ గాచుకొన నెంచి వహించితివా?

మద—కష్టసహిష్ణుకతచే నీ వ్రతము ప్రస్తుత మవలంబించితిని. నా తుదికోరిక యొకటి కలదు. తల్లి..................

బుద్ధి—ఛీ! మూర్ఖా! ఆపెయైన నాకాళ్లం గడుపునం బడి బ్రతిమాలి ప్రాణదాన మొసఁగ సమర్థురాలనియా. అభినవ ప్రహ్లాదుఁడు పప్పులో నడుగు వేయ మొదలిడుచున్నట్లున్నది.

మద—అపరాధము మన్నింపుఁడు. తల్లిం బిలువ నంప నక్కఱలేదు. ఇఁక నొకమాట పలుకను. మౌనవ్రత మూనితిని. కనులు తెఱవను. సాగిలఁ బడుచున్నాను. ఈ శరీరము తమ స్వాధీనము.
(అట్లొనర్చును.)

బుద్ధి—ఔరా! ఇదేమి! హృదయము కలగుండు వడియె. ఆపాదమస్త కము గజగజ వడంకెసి. కర మెత్త రాకున్నది. చూపులు నిలు చుట లేదు. తల తిరుగుచున్నది. వైశ్యభ్రమయా!

పైత్యభ్రమ కాదు. చిత్తభ్రమ. కాదు ప్రేమాంకురబీజ విజృంభణము. కఠినమన మను ఘోరాసి ప్రేమాంకురమును మొదలంట ద్రుంచదయ్యె. క్రోధమా! నన్వహింపుము. దైవమా! నూతనబలమును, ఘన స్థైర్యమును, నిష్కరుణతయుఁ బ్రసాదించి యీ తులువను రూపుమాపఁ జేయుము. (బలవంతముగ లేవఁ బోయిఁ జాఱిపడును). ఏమిది! కా లూఁచఁ జారినది. కంప మధిక మగుచున్నది. ఏకపుత్ర విషయమే యను వ్యామోహమే నన్నా డించుచున్నట్లున్నది. ఔను. చేతులమీఁదఁ బెంచిన వానినిఁ జేతులారఁ జంపుటెట్లు? "చిత్తమా! చంచలత వహింపకుము. ధైర్యముఁ జెప్పుకొనినను దుఃఖమాగుటలేదు. గుండె బ్రద్దలగుచున్నది. నఱుకలేను; నఱుకలేను. లోకాపవాద భరింపఁజాల. రాజునకై తెచ్చి కోడలి నొనర్చుకొన నందురు. నా శిరమును నేను ద్రుంచుకొందు. అట్లొనర్చిన నా పుత్రుండీ దుండగమును నొనర్చెనని యురిశిక్ష వేయుదురేమో? అయ్యో! పాపిని; కూళను. తల్లినిఁ దిలకింప నెంత యారాట ముండెనో. కఠినపుమాటాడి మనము విరిచితి. మనమా! నిన్నావరించినది బుద్ధిసాగరుని కళేబర మనుమాట మఱచి వెఱ్ఱిపోకడలు పోవుచున్నావు! ఇది గుండె కాదు; లోహము. దయాదాక్షిణ్యములు కర్కోటకుల యెడ వహింప నిందు స్థానములేదు. (అనుచు, చినాలున లేచి) ప్రశస్తమగు హస్తమా! ఒక్క వ్రేటున మొండెమునుండి తలను విడఁదీయవలయుఁ జుమీ. (అట్లొనర్పఁ గర మెత్తును).

(తెరలోనుండి, అరే బుద్ధిసాగర్ ఠైరోరే! భాయి! ఠైరో యనుచు, నవాబు సయ్యదహ్మదుఖానుఁడు ప్రవేశించి బుద్ధిసాగరుని చేతిలోని కత్తిని పెఱికివైచి గట్టిగఁ బట్టుకొనును)

నవాబు—అరే! అన్నాగారూ! కూని చేస్తాయి నీకీ ఖబుర్ మీాద ఉడాయించి వచ్చేగావా.

బుద్ధి—ఓసీ దుర్మార్గురాలా! ఎంతపని చేసితివే!

నవాబు—మీాది హఁచ్ఛామార్గణం ఏం. చెట్టంత కొడ్కు కిచి చేయటం కోఁ బోలా మీాకి? హే! అబ్బాగారు! మధణగారు! ఉరోజీ! అయ్యా! ఉరో బాబూ ఉరో. హిద్దర్ మన్సుల్ మే హెంతా ఆళాసం కల్గింది! కల్గింది; హెంధూఖా నీకె కోపం బుద్ధిషాగర్?

బుద్ధి—రాజునకై నే తెచ్చిన కన్య యంతఃపురముననుండ బలిమి నందుఁ జేరి యాపెను వశపఱచుకొనియె.

చిత్ర—(హర్మ్యమునుండి) మామగారికి వందనములు. భర్తయాజ్ఞ నుల్లంఘించి సమీపింపఁ జాలనందులకు వగచుచునిం నుండి మాటాడుచున్నందులకు మన్నింపుఁడు. రాజునకై తమరు నన్నుఁ దెచ్చినవారుకారు. ఆమాటకడ్డుమాట నే నారంభమున నే నుడివితిని. అనాథను రక్షించితిరి. మా యిరువురి గాంధర్వ వివాహంబులును గట్టుబాటునకు లోఁబడినవే. ఆదినుండియు నొండొరులఁ బ్రేమించి యున్నవారమే. తుదకు సతీపతులమైతిమి. ఒకరికొకరు నూతనులమై సందర్శనమాత్రంబున విరహదావాగ్ని దుమికినవారముకాము. మనములఁ బరీక్షించుకొని మసలితిమి. నవాబుగారి ప్రవేశమువలన నీ మాత్రమామంత్రించుట కవకాశముఁ గల్గె. భర్తకరవాలము నాకడ నునిచి చనియె. భర్త కంఠములోని ప్రాణవాయువులు తిరుచే నివర్తింపఁ బడినతోడనే మన్మస్తకము నాతని పాదములకడ నివేదించుటకే యీ కరవాలము.

నవాబు—బుద్ధిషాగర్! అమ్మాయీగార్ అమృతం చెప్పారు. మేం రాఖాఫోయాంతో రెండు పీనగల్ చేసేవాడ్. మీాకీ బేటాకి తే చెప్పు. తప్పుషూది శిచ్ఛాదబ్బాణాం మన్సు మిలాఖత్ గాని మొల్లారు జనానాకి. అల్లా అచ్ఛామాసాడు. ఖులాసాహూగా. జనానాకీ ఎల్లాడ్గ్నాని చంపటం. నీకీ అంతకోపం బోం చేయటం బాగా ఉండాయి లేదు. అక్బార్ జరాజరా హై. అదిచెప్పాతో మదణగార్కి దమన్నభాయి ఉపా రెక్కిపించాక్. మై సాబ్బీ బోల్తుంతే. బచ్చారు హుటో బోలో. మస్కి ఎల్దాంరా.

బుద్ధి—నాయనా! మదనా! లెమ్ము. నవాబు సయ్యదుఖానుఁడును చిత్రరేఖయును వివరించిన వాక్యవిశేషంబులు నే తొందరపడినట్లు విశదమయ్యె. నేనెంత ధీచాతుర్యములతో నారంభమునను౦డియు నిక్కార్యాచరణంబునఁ గాలూనినను దైవమననుకూలుఁడగుటచేఁ బర్యవసానము ప్రకృత్యన్యథాభావమునుసూచించుచున్నది. నాయనా! కాచితి లెమ్ము.

మద—మహాప్రసాదము.

(బుద్ధిసాగరుఁడును, సాహెబును వెడలుదురు.)

(హర్మ్యాంతరము నుండి దిగివచ్చుచున్న చిత్రరేఖను మదనుఁ డెదుర్కొని కవుగలించికొనును)

చిత్ర—నాథా! నాపాలిటి భగవానునట్లు నవాబు సాక్షాత్కరించి పతిభిక్షనిడెను. తమ యాజ్ఞకు విరుద్ధముగ వారల ప్రస్తావనయందు నేను చొరవఁ జేసుకొని మామగారి దురభిప్రాయమును బాప సమకట్టినందులకు మన్నింపుఁడు. యథార్థ మొకరీతినుండ భిన్నాభిప్రాయులై యన్యథాపథానువర్తులగు మామగారిని సత్పథంబునం ద్రిప్పుట కట్లాడకఁ దప్పినదికాదు. వారింప నేతెంచిన యమ్మహాత్మునకు నాపల్కులు సాయపడియె. ప్రాణేశా! ఆతురమక్క సత్తముఁ దెవంతు!

మద—ఈ సాహెబు పలుకుబడిగల గొప్పజమీందారుఁడు. మా తండ్రిగారును వీరును బాల్యహితులు. ఏకోదరులట్లు వ్యవహరించుచుందురు. తండ్రిగారు తీవ్ర కోపోద్దీపితులై నన్నునమ నిశ్చితాభిప్రాయులై వెన్నాడుటంగని మాతృశ్రీ, యితండు దక్క నన్యులు నివారింపనశక్తులని కబురంపి యుండును; దాన నాకిఁ డత్యంత తీవ్రగమనంబునఁ బ్రవేశించె. కన్నతల్లియు, తండ్రిగారాబు చెలికాడును, కరమందిన కాంతామణియు, విశ్వప్రయత్నమొనర్చి యీ నిరర్థక జీవినిఁ గాపాడిరి.

చిత్ర—నాథా! మనుష్యయత్నంబులు దైవ సహాయంబుననే ఫలోన్ముఖతఁ గాంచు. ఆతని నియామకమట్లు కార్యము లాచరణీయంబులు కష్ట సుఖంబు లనుభవనీయంబులు. ఈ యల్పురాలి మూలమున గదా యింత యలజడి కలిగె.

మద—(కౌగలించుకొని) ప్రేయసీ! మన కొమరులకుం గల నిర్మల గాఢానురాగమును, నిశ్చలమనస్సంకల్పమును పరమాత్మ గ్రహించి భద్రముం గూర్చె. గతమును మఱచి సర్వకళ్యాణంబులం దేలుదము రమ్ము.

(ఇరువురును వెడలుదురు)

(తెర వ్రాలును)

---

# బుద్ధిసాగరవిజయము

## నాల్గవయంకము

(ప్రథమ రంగము)

రాజమందిరము:—సుదర్శనుఁడు, దమనుండును
పీఠంబులఁ గూర్చుండి యుండురు.

దమనుఁడు—రాజా! అర్ధాంగలక్ష్మి నిర్ణీతయయ్యెనన విను భాగ్య మీనాఁటికైన లభ్యమాయెనా?

సుదర్శనుఁడు—మంత్రివరా! అట్టి శుభంబులేవియు ఘటింపవయ్యె.

దమ—ఇఁకఁ దడవు కానేరదు. బుద్ధిసాగరుఁ డింటిలోని పోరుం దీర్చుకొనియె నఁట. నృపకులావతంసమా! భవదర్థము బుద్ధిసాగరుఁడు గొని తెచ్చిన నవవిలాసినీమణిని మదనుఁ డపహరించి మదన సామ్రాజ్య లక్ష్మిగఁ బడసె నఁట.

సుద—సచివశ్రేష్ఠా! ఇట్టిది సంభవించియుండునని నమ్మిక పొడమియుండుట లేదు.

దమ—అవును పావము. బుద్ధిసాగరునియెడ దమకుఁ గల పూర్ణ విశ్వాసము, ప్రబలభక్తియు నట్లనిపింపకఁదప్పవు.

సుద—ఐనను, నీవు వినినతీరున వినిపింపుము.

దమ—వచించుటకేమియున్నది? కన్యను దెచ్చినమాట వాస్తవము. పురుషవేషంబున గృహప్రవేశమొనర్చునెడ మదనుఁడా పెను గాంచి వరించెనఁట. ఆపెయు మదనుం బ్రేమించెనఁట. ఈబుద్ధిసాగరుం డెట్టులో యావిధమును వాసనఁబట్టి కార్యాంతర మిషచేఁ బుత్రుని యిల్లు వెడలఁ దరిమెనఁట. అతఁడు నియమిత కార్యభారమును నిర్వర్తించి గృహోన్ముఖుండైనతోడనే యతఃపుర కాంతా జనంబుల నవలఁ ద్రోలి యాపెం గూడెనఁట. తదనంతరం బావిధాన మంతయుఁ జెలులమూలమున మన సచివాగ్రేసరుం డారసి మించి వచ్చినదానిం గప్పిపుచ్చు సరభసంబునఁ హిరణ్యకశిపు నవతారమూని రోషకషాయిత నేత్రుఁడై కన్న కుమారు కంఠమునుం దునుము రాద్ధాంత మొనర్చునెడ, నవాబు సయ్యదమ్మదుఖానుం డీయుదంతం బెఱింగింపఁ బడినవాఁడై, వారిని, శాంతియుతులను జేసి, మరణాంతిక ప్రదర్శనంబును సంతోషదాయకంబుగ మార్చెనఁట.

మద—ఇంత గాథజరిగెఁగా! మంత్రి నాకై తెచ్చిన కాంతను దనయింట నుంచుకొనుటదేల? ఆమహాకార్యమే యింత ముప్పులకాలవాలము. నిదర్శన పూర్వకంబుగ నుడువుచున్న నీ వాక్యసరణి నిరాకరింప నలవిగాకున్నది.

(తెరలో)

(సేవకుఁడు, దేవరవారికిఁ బ్రణమిల్లి విశదపఱచుకొనున దేమన మన హాజారము కడ బుద్ధిసాగరుఁడుగారు ప్రవేశము నపేక్షించుచున్నారు.)

రాజు—సేవకా! వారిని సత్వరంబున లోనం జేర్పుము.

(బుద్ధిసాగరుఁడు ప్రవేశించును)

బుద్ధి—(స్వగతము)

ఉ॥ అప్పుడె చేరి నీ తులువ • యక్కసుఁబూనఁగ జేయదేవరఁ,
దప్పులఁబట్టఁగా వెదకు • దైవము ప్రార్థనఁ జేయుఁగూర్పు, నా

యిప్పటి రీతికిం దగిన ♦ వెవ్వియో కల్పనచేసి పల్కు, నే
మున్పనొ కూర్చు, మత్సుతుని♦మోహము! కొంపకుఁ జేటుఁగూర్చి తే।

తే॥ గీ॥ మాటిమాటికి సుతునికా ♦ మంబు నెంచి
దూరుఁబొప్పదు నాయకే ♦ దోసమిందు
రాజునకు దేవిఁ గూర్చు దు ♦ ర్గర్వమేల
అనవసరపు జోక్యపు ఫల ♦ మందనుంటి॥

నా యనుమానమున కనుగుణముగఁ బార్థివేంద్రునిమోహమున నేదియో మాఱ్పునోచరించెడి. జోటిలోఁ దలనుంచి జోఁకటి పోటునకు వెఱవనేల? (ప్రకాశముగా) దమనార్యా! ఎప్పుడు దయచేసితిరి?

రాజు—సచివాగ్రణీ! ఆపీఠ మలంకరింపుఁడు.

దమ—ఆర్యా! కడచిన సాయంసమయమునఁ బురముఁ జేరితి. సచివాగ్రేసరా! నృపుఁడు
"చను నె? కృపావిహీనులయి♦సంగడు లొండొరు మోసగించుటల్"
యను పద్యపుఁ గడపటి పాదము నొసంగి పై మూఁడుపాదంబులఁ బూరింపుమనియె నా శక్తికొలఁది నే నిట్లంటి.

చం॥ కనులకుఁ దాకు పుల్లలను ♦ గాంచి చరింపక, యే వృథాప్రసం
గ నిరతినేని దంభముల ♦ గవ్వకునాలుఁగు ప్రేలుఁబొప్పు, దా
పసికిఁ గడంగ "నాది" యను ♦ భావము వీడక యుంట లెన్నయే?
చను నె?కృపావిహీనులయి ♦ సంగఁడు లొండొరుమోసగించుటల్।

తమరు సద్దానిం బూరింపుఁడు.

బుద్ధి—(స్వగతము) తేఁడు గౌరవింపకుంపుటయు, బూర్ణాధికారమును వహించి దమనుఁడు ప్రసంగించుటయు, నీతేఁడు స్వామిని నాయెడ విముఖునిగ నొనర్చుటలో విజయము గాంచెననుట ధ్రువమయ్యెడి. అగుఁగాక. కానున్నది కాకమానదు. (ప్రకాశముగా) భావగర్భితమయి త్వద్విరచిత మలరారుచున్నది. నాయది యాకర్ణింపుము.

చం॥ ధనమును గోరియో, యితరు • దర్పమడంపను, యోర్వలేమినో
ఘనత వహింపఁగోరియో, వి • కావికఁజేసెడిఁ గూర్మి మిత్రులన్
జెనఁటి దురూహతో నిమిడి? చెట్టునుగూల్చెడి చీఁడపుర్గు నా
చను నె? కృపావిహీనులయి • సంగడు లొండొరు మోసగించుటల్॥

రాజా! తమ రేరీతిఁ బూరించితిరో వినం గుతూహలమయ్యెడి.

సుద — అనుభవశాలులగు మంత్రుల మ్రోల నా చిల్కపల్కు లేల?

దమ — తమరట్లాడుటఁగొప్పనే? సింహకిశోరంబునకు గాంభీర్యంబును, గోయిల పిల్లలకు గానమాధురియు స్వభావ సిద్ధంబె కదా.

సుద — తమకట్టి యుత్సాహభంగముఁ గూర్పనొల్లమి నా భావము వివరించెద నాలకింపుఁడు.

చం॥ ఘనగుణశాలినంచుఁ దమ • కంబునఁ బిల్వని పేరఁటాలకున్
జనుటకు సిద్ధమౌచు, నిజ • శక్తిఁ దలంపక కార్యభారమున్
బనరుప సాహసించి, తుద • కోడి, యడంచు ఖలుండు సత్యమున్
జను నె? కృపావిహీనులయి • సంగడులొండొరు మోసగించుటల్॥

దమ — ఆహా! తమ భావము కాలానుగుణ్యముగను, స్వభావసిద్ధముగను, ప్రత్యక్ష నిదర్శనముగను దోఁచి వీనులకు సంతసంబు నించె. బుద్ధిసాగర మంత్రివతంసమా! తమ్మీపాలుని భావప్రదర్శనమున వారికై తమరొనర్చు కన్యాన్వేషణ పరిశ్రమ ఫలితార్థంబులయెడ భేదాభిప్రాయములు తలలెత్తినట్లు స్థిరపడెడి. ఇంతటియాలస్యము మాబోంట్లకే సైఁప దుస్సహముగ నున్నది. వారి కిట్లనిపించుటలో విపరీత మేమియు లేదు. దీనికిఁ దోడుగఁ దమ యింటిలోని "చిత్రరేఖా మదనాభిరామ" నాటకము పూసఁగ్రుచ్చినట్లు స్వామికి విదితమై యమితాగ్రహమున హేతుభూతంబయ్యె!

బుద్ధి — దైవసంకల్పానుసారంబుగ గార్యంబు లట్లయ్యె.

సుద — కన్యందెచ్చినట్లే సంభాషణలయందును సూచింపవైతి వేల యమాత్యవర్యా?

బుద్ధి—ఆరంభము నుండియు మీ కేల్పట్టుట కాపె యనంగీకారమును గన్పఱచుటయే కారణము.

దమ—మదనుండదప్ప నన్యుని వరింప ననంగాంబోలు.

బుద్ధి—తొల్లిటిదోల్లనే వివాహవిషయంబుల పరాధీనవు గాపనియె.

దమ—అట్లైనం దమరేల తోడ్తెచ్చితిరి?

బుద్ధి—ఈ ప్రశ్న యర్థశూన్యము. అర్థుల రక్షించి పోషింపరాదో? పాపులవారినుండి బ్రోచి దిక్కెవ్వరును లేరన నిలుచేర్చితి. భూపతికిం గూర్పనెంచి వివరించితి. ఆబాలయు మా మదనుండు నొండొరుల, మా గృహప్రవేశ మొనర్చునాండే చూపులం బ్రసరించుకొని మనోభావంబుల వెలిబుచ్చుకొనిరట. తుదిపఱకును యీ విషయమే నెఱుంగను. మీ సౌందర్య విశేషాతిరేకంబులును, తానందనున్న యుత్కృష్ట ప్రభీపదంబును దెలియంబల్కినను వ్యతిరేక భావంబునం దాను వలచినవానిం గాని తా వరింపననుట భవన్నికాయంబునకుం జేర్పవలనుపడదయ్యె.

మ॥ తెలియం బల్కితి భూప నావివరముల్ ♦ తీవ్రంపు భావాళిచే
గలంతం బీడంగం జేయంగాం గలుగు, సా ♦ కర్యంబులేయున్న, నే
కలుషాత్ముండను, సత్యసంధుండను, త ♦ ర్కంబొప్పం గావింపుం డా
వలనైనం దమ యంతరాత్మకు స్ఫురిం ♦ పం బోవె సత్యస్థితుల్॥

శా॥ నీసాన్నిధ్యమునం వచింప నెపుడై ♦ నీతిం విలోకింపకే
వోసాకుల్ సమయానుకూలముగ నే ♦ నొందంగ సౌభాగ్యముల్
గాసిం బెట్ట నమాయికుం దమ గటా ♦ తు శ్రీ విలాసార్థినై
నీసంబేనియు దోస మేనెఱుంగం బ్ర ♦ ధ్వీనాథ! ఆలింపవే॥

భూపాలా! నీ జనకునియెడ నాకుంగల భక్తి విశేషమునను, ఆతని నిర్యాణకాలమున నేనొనర్చిన వాగ్దానానుసారముగను, నీయెడంగల పుత్రవాత్సల్యమునను, నీ కర్థాంగినింగూర్పం బ్రయత్నము లొనర్చితి. అంతియెకాని, స్వశ్రేయమున కాధారమగునని సంకల్పించినవాండను గాను.

దమనా! నీ దుష్ప్రియలే నీ భవిష్యదభివృద్ధికి భంగకరంబు లని దూరదృష్టిం దిలకింపలేనివాఁడవైనా నాలేమి నీ జయప్రదంబున కత్యంతావశ్యంబని పొరఁబడి నా శీఘ్రపతన మభిలషించుచు మెడ తెగని కార్యదీక్షం జరించుచున్నావు. పనుగుఱిమేలు మన మపే క్షించినఁగాని యొకమేలు మనకు సేకూర దను న్యాయ మజ్ఞానివై తెలియ వైతివి. ఆరంభమున నా పుత్రుని రేపెట్టితివి. అసత్యంబు లనేకంబులు సమయానుకూలంబుగ బట్టువోలె రాజుకడ నేకరు వెట్టుచు నాసిరిం దుల్లఁజేయ సిద్ధమైతివి. అశరీరుఁడై ప్రపంచ చిత్రంబులం గనుచున్న విరాట్స్వరూపుఁడు మానవుల యఘ సంచయంబులకు ప్రతిఫల మప్పుడప్పుడే కూర్చుచుండు. వెన్ను విఱుచుకొని తిరుగు టొప్పదు.

దమ—ద్రోహ మొనర్చి పట్టువడి నా పైఁబడిన నేమిలాభము? మిన్ను మన్ను నెఱుంగక వెన్నువిఱుచుకొని దిరుగ నేల? ఇప్పుడైనను దాసోహమ్మనక యీ తెగనీలు గేల? నీ వొక్కనాఁడు నను భూషించితివా? ఇపుడు దూషించుచున్నావా? జన్మాంతర వైరు లము. పొమ్ము; నీపాపమున నీవు పోదువు.

రాజా—

తే॥ గీ॥ "శాపనార్థంబు" లంబెట్ట ♦ సాఁగె నితఁడు
నన్ను మొదలెత్తె రాజ మీ ♦ నామ మెత్తు
పైన విమపుఁ బన్నులను దా ♦ విప్లవంబు
మూడుఁగానఁ దొలఁగఁ జెల్లు ♦ ముప్పువాయ॥

సుద—(కోపముతో) దమనాఖ్యా! బుద్ధిసాగరుని మోమును నేనిఁకఁ జూడనొల్ల. అతని పల్కులన్నియు యనృతములు. నాకై దెచ్చిన కోమలాంగిని సుతున కీతఁడే కూర్చెననుట నిర్వివాదాంశము. ఈ క్షణముననే యాతనిని యుద్యోగమునుండి తొలఁగించితిని. ఇఁకముందు నీవే ప్రప్రధానివి. ఈతనిం జీఁకటి కొట్టులోఁ ద్రోయింపుము. మదోన్మత్తుండగు మదనునింగూడఁ జెఱసాలం

శేఖ్పడు. నన్వరింపనని మదనునిఁ బాణిగ్రహణ మొనర్చిన నాతిని నాకడ కీడ్పించుకొని రమ్ము.

(సుదర్శనుఁడు వెడలి పోవును.)

దమ—రక్షకభటులారా! బుద్ధిసాగరుని చెఱఁ ద్రోయుఁడు?

(దమనుఁడు వెడలి పోవును)

మొదటి రక్షక భటుడు. } స్వామీ! ఇదేటి విపరీతము!

రెండవ భ—రాజ్య వినాశనమున కిట్టివే నిదర్శనములు.

బుద్ధి—భటులారా! అశుభంబుల నాడఁ జెల్లదు. దారితీయుఁడు. మీ విధ్యుక్తధర్మంబులొనర్పక యుపేక్షించుట పరమ దుర్మార్గము. నాయందు నింతకుముందు మీకుఁగల భయభక్తుల కిఁక స్థలములేదు. జీవిపోషణయందున్న మీ రాతని యాజ్ఞలకు నోసి లొంగుట సేవాధర్మము. అర్హాకృత్యము. తప్పుట తనకుఁదాను గొయ్యి దీసికొనుట యనుట ధ్రువము. పరమాత్మా! మంచి గుణపాఠము నేర్పితివి. మానవులు, ఎదుటివారి యంతర్గతాభిప్రాయంబుల నరయ నసమర్థులు; అసమర్థులు.

శా॥ నాసర్వస్వము ధారవోసి, స్థిరమా ♦ నారాజ్యమేమించు నే
వీసంబేనియుఁ బ్రాలు మాలక విధుల్ ♦ వేవేగ నీడేర్చఁగా
నీసుంబూనినఁజేతు లోఁదలఁపఁ "డె ♦ ద్దినిందవం గొట్టమే
వాసంబన్న" తెఱంగునన్ దమను దు ♦ ర్వాక్యమ్ములే నమ్మెఁగా॥

ఉ॥ తేఁడును రాజ్యలక్ష్మియె త ♦ రింపఁగఁ జేయును నన్నటంచు ది
గ్గాడుచు శ్రీశ! నేఁ గడు బ ♦ రా జ్ముఖతన్ స్మరియింప నిన్ను; న
న్నాడని నీచుడంచు దయఁబాసి ♦ చెఱన్ నరకంపుబావిలోఁ
బాడిమె ద్రోయ? మత్కృత వి ♦ పాక మహత్తర పాతకంబె పో॥

(ముప్పురును వెడలి పోవుదురు.)

(తెఱ వ్రాలును.)

—* నాల్గవయంకము *—

ద్వితీయరంగము.

[అడవి—మదనుఁడు నిలిచియుండును]

మద—

సీ॥ నామూలముననఁగదా ♦ నన్నుఁ గన్నయ్యకు
బందిలోఁబడుట సం ♦ ప్రాప్తమయ్యె
నామూలముననఁగదా ♦ నన్నుఁ గన్నతల్లికి
భరణపుంగూటి దా ♦ ర్భాగ్యమబ్బె
నామూలముననఁగదా ♦ నాతన్వి నడిచెడిక్
కంటకావృత ఘోర ♦ కాననముల
నామూలముననఁగదా ♦ పల్గిశల్ నుతిగన్న
బుద్ధిసాగరుకీర్తి ♦ బుగ్గిఁగలసె
తే॥ గీ॥ కాదు కులనాశకుఁడను నే ♦ నౌదు కుమతి
మోహజలధి నిమగ్నత ♦ మూర్ఛవోయి
తల్లిదండ్రుల కష్టముల్ ♦ దలఁపలేక
తరుణితోఁ సాఁగితేఁ దల ♦ దాఁచుకొనఁగ॥
తే॥ గీ॥ కొడుకనిన నేన, యుద్ధార ♦ కుఁడను నేన
పెల్లగించితి కూకటి ♦ వేళ్ళతోడ
మొలకలెత్తంగనీక న్వ ♦ కుల ఘుశన్ను
వంశపారంపరీణమా ♦ వాసితోలఁగె॥

అయ్యో! నే నెంత వెట్టిని! జన్మమునకుఁ గారణభూతులగు మాతాపితల సరకుసేయనైతిగా! ప్రత్యక్షదైవముల కెగ్గుగూర్చిన వాని కెన్ని దుర్గతులున్నవో కదా. మోహమా! ఏమి నీ చతురత! కన్నుల కెగదట్టి చేయించిన,దౌకటి; మరలఁ బశ్చాత్తాపము సూచిం చెదవా? అప్పు డంత మదాంధత యేమి? ఇప్పు డీ పరితాప మేల?

ఉ॥ ఎక్కడిరాగమిద్ది తర • లేక్షణపైఁ దలి తండ్రికన్నఁ; బె
న్మక్కువఁ బెంచి విద్యల స • మర్థునసర్పరె, గంపెఁడాశతోఁ,
జిక్కరబొమ్మయుంచుఁ బలు • సా ర్లను దజ్ఞత మోహరజ్జులం
జిక్కి చరించుటల్ క్రమమె, • ఛీ! పెడబుద్ధి! నను ద్యజింపుమా॥

అ! ఏమనుచున్నాను! చిత్రరేఖపై నేటి ప్రేమయునియా! నా యాత్మప్రాణము నవమానించుటయా! విడిచిన తలిదండ్రుడు లెక్కవయా? వెన్నంటిన విమలాంగి మిన్నయా? స్వసౌఖ్యమును దృణప్రాయముగ నెంచి నిరుపమాన సౌభాగ్యసంపదల నందుట నిక్కవమని చెప్పకయే చెప్పుచున్న రాజేంద్రుడు భోగమును వానికై తృణీకరించిన యీ చానకన్న నీ యుర్వి నా కొరు లెక్కవారున్నారా? సుఖదుఃఖంబులఁ దులయై పాల్గొన్న కలికిం జులకన జేయు టేటిమాట? ఇంతీ! నీ పరోక్షంబున నేమనుకొనిన నేమి? నీ ముఖావలోకనంబున మరులు పైఁగొన నెండు తలంపుల కవకాశ మెట్లుండును? సూదంటు రాయివోలె నిష్కల్మషమగు ననురాగపుం జూడ్కులు దుశ్చింతలఁ బాపి యాకర్షింపఁగలవు. జలాశయంబున జలకమాడునెడ సహోదరులుగ భ్రమసి నీటిపాములు కురులను, మీనములు నేత్రములను, తామరతూండ్లు కరములను ముద్దిడుకొనుచున్నవి. నారశ్మిసోఁకి కమలని కమల ముద్భవించెనే యని ప్రకృతి చిహ్నము తెలవంచె నన్నట్లు మేఘముచాటున నొదిగె. అంచయానా! సిగ్గని హంసలు అడుగిడక సిగ్గున మూలముడుచుకొని యున్నవి. సప్తజన్మములెత్తినను నిన్బోలిన సహచారిణి నాకు లభించుట దుర్లభము. (చప్పట్లుగొట్టుచు) చిత్రా! వియోగభరము కడుంగడు దుర్భరము. జలక్రీడలం జాలించి రా రమ్మ.

[దమనుఁడు ప్రవేశించును.]

దమ—(స్వగతము) కపటీ! నవాబా! రహస్యముగి సాగనంపిన దంపతులను వేఁజిక్కించుకొంటిని. నా కనులు మూయు నితరమగునా?

తే॥ గీ॥ పౌర నాశక్తి సాబుద్ధి • యాత్మబలము
క్రొల్లునిని జేసితిం బిల్లి • కూనసిపు

కప్పఁబాఱ్ఱివి నాకడఁ ♦ గావువింత
యురగమునుబోలెఁ గబళింప ♦ నుంటిమదన॥
తే॥ గీ॥ మదనుఁడొక్కఁడె గనరయ్యె ♦ మగువయేడ?
మదనుతలమూర్తి యేరైన ♦ మగువఁగొనిగొ
చిత్రరేఖను శిక్షింపఁ ♦ జేతునంటి;
జనపతియఁటన్న కేసరి ♦ స్వప్నమయ్యె!
చిత్రరేఖ యుండెంద్రైన మసలుచున్నదేమో చూచెదఁగాక.

(దమనుఁడు లోనికిఁ బోవును)

(ఒకపురుషుఁడు, ఆవలిపార్శ్వమునుండి ప్రవేశించును)

పురు—(స్వగతము) ప్రసంగమువలన నేఁగిన యాతఁడు దమనుఁడనియు నందు నిలిచిన యతఁడు మదనుండనియు విదితమయ్యె. నవాబూహించినట్లే దమనుఁడిందుఁ బ్రవేశించుటయు, దంపతులఁ జిక్కించుకొంటినని మురియుటయు, చిత్రరేఖాసహితుఁడై యేగకున్న స్వనాశమున కవకాశమని విలపించుటయు వినంగల్గితి. నేనీ మదనునకు నన్నెఱిగించుకొనుటయే యుత్తమము కావున్నఁ గార్యము చెదును.

(నాల్గడుగుల ముందునకుఁ బోవును.)

(ప్రకాశముగ) మంత్రిసుతా! మదనాఖ్యా! నేను మీ ముఖ్యమిత్రుఁడగు నవాబుగారి యాజ్ఞను పాలించుచు నిటకు విచ్చేసితి. దమనుఁడు మిమ్మీపురం బంధించి కొనిపోవ నీక్షణమున నివ్విపిన ప్రవేశమొనర్చె. నీయింతి జాడఁ గననేగె. ఆపె నిటకుఁ బిలువుము. నేనన్యుఁడనని సందేహింపకుము. నీసతీతిలకమును సత్వర మెదురేగి కొనిరమ్ము.

మద—మహాత్మా! అటులనా. పుణ్యమూర్తీ!నవాబా! నిశ్చయముగ నీవే నాపాలిటిదైవమవు. తెప్పపాటు కాలములో సతీ యుతుండనై వచ్చెద.

(లోనికేగును)

(పురుషుఁడు బాణతూణీరంబులం దిగిచి యోధుని వేషముఁ దొలఁగించి సహజ స్త్రీరూపమున నిలిచి)

(ప్రకాశముగ) ఈదినముకదా సుదినము. నాతోఁబుట్టువుం గనఁబోవుచున్న దాన. అక్కయ్యా యీ శశిరేఖను గుర్తింపఁ జాలకుందువా?

(మదనుఁడు, చిత్రరేఖయుఁ బ్రవేశింతురు)

చిత్ర—(ప్రవేశించిన వెంటనే శశిరేఖఁజూచి తత్తరమున) ఏమిది! నాశశిరేఖయా! ఎంతటిభాగ్య మెంతటిభాగ్యము!

(అనుచుఁబోయి కౌఁగలించుకొనును)

శశి—(మదనునిఁ జేరఁబోయి) బావగారికి నమస్కారములు. పురుష వేషమునఁ దమసాన్నిధ్యముఁ జేరి తొలుదొల్త నావిషయము వివరింపనందులకు మన్నింపుఁడు. కార్యభారమున నట్లొనర్చితి. మీచరిత్రనంతయు నవాబుగారి మూలమున సాంగముగవింటి. నా నిజ చరిత్రము వారికిం దేటపఱచితి. వారిపంపుననే మిముంగన వచ్చితి. ఈవనము తమకుఁ బరిచితమే యగుడు నిందెందేని మీరు దమనుని కంటఁబడకుండ దాఁగియుండుఁడు. నేనిందు విహరించుచుందు. దమనుఁడు నన్నే చిత్రరేఖయనుకొని రాజు పాలికిం గొంపోవును. పైవిషయ మెట్లుండునో చూచుకొందము. మీయాపద్వాపు కొనుటకిదియె మార్గము. ఇది నవాబుగారి పన్నుగడ. తమరిరువురు వేవేగమే తర్లుఁడు. నవాబుగారహర్నిశ మాహార నిద్రలమాని మామగారి విడుదలకును, దమనునిపొం గడపను, మామగారి కీర్తిని బునరుద్ధరింపను, రాజునకుఁ దారతమ్యజ్ఞాన మలవఱపను విశ్వప్రయత్న మొనర్చుచున్నారు. తమ రాలసించుట వారికార్యదీక్షకు భంగ మొనఁగూడునేమో? అక్కయ్యా! ఎడఁబాటునకై వగవకుము. సక్రమముగ విధులు నెఱవేఱిన నత్యంతాల్ప కాలములో మనకు సమాగమ మయ్యెడి. నాకుఁగీడు మూడునని భయపడకుఁడు. అగోచరులగు నవాబుభృత్యులు నన్నురక్షింప

నెల్లెడల విజృంభించి యున్నారు. (లోఁదాఁచిన కరవాలమును లాగి చూపుచు) నన్ను రక్షించు నదియు, రక్షింపనున్న దియు నిదియె. నిర్భయముగ వెడలుఁడు. (కరవాలము దాచును.)

(మదనుఁడును, చిత్రరేఖయు వెడలిపోవుదురు)

[దమనుఁడు ప్రవేశించును]

దమ—(స్వగతము) (శశిరేఖను దేఱిపాఱఁజూచి) ఈ పెయే చిత్రరేఖ. నిస్సంశయము. నాప్రాణములు దక్కినట్లే.

(ప్రకాశముగ) స్త్రీరత్నమా! నీ వెవరు? మదనుని యిల్లాల వగుచిత్రరేఖ వీవే యనుకొందును.

స్త్రీ—(చెవులుమూసికొని) హరి హరీ! పాపము శమించుఁగాత! పురుషవతంసమా! నేను చిత్రరేఖ నీగాని మదనుఁడు, వారివారు, నన్నాతని యిల్లాల ననుకొనుచున్నారు. కాని నేఁగాను. బుద్ధిసాగరుఁడిటఁ బలవంతముగఁ జేర్చుకొని సుతుని వరింపుమనుచున్నాఁడు. నన్న స్వతంత్ర నొనర్చిరి. మదనుఁడు నన్నిదువరకు పిశాచమై పీడించుచున్నాఁడు. కదలనీయకున్నాఁడు. ఈ జలాశయమున స్నానమాడు మిషనిందుఁ జేరి నాదుస్థితికిఁ దలపోయుచున్నాను. నన్నితని బారినుండి తప్పింప నీకు సామర్థ్యమున్న నన్ను రక్షింపుము.

దమ—(స్వగతము)

ఉ॥ ఏదమనుండఁగాను మును - పే కనకం బని ముట్ట మట్టియా;
ఆదనుజాంతకుండు కను - లారఁ గనుంగొన నేఁటితోఁజనెఁ
నాదురితంపుఁబుంజములు - నాతినుడుల్ జనపాలవాలి హా
ర్షోదధినోలలార్చుఁ; బరు - షోక్తులఁ బాల్పడనీకఁ బ్రోచెఁగా॥

(ప్రకాశముగ)

కన్యకామణీ! బుద్ధిసాగరుఁడు మాసుదర్శన భూధవుని నీవు వరింప నంటివనియు మదనునే గాంధర్వ విధినిఁ గేల్పట్టితివనియు నుడివెనే. అంతయును నాకాశపురాణమేనా? కుమారుని దుండగ మెఱిఁగి తనుమాడ నుద్యుక్తుం డయ్యెననియు, నవాబు వారించెననియు వింటిమే.

చిత్ర — అన్నియును పృథలే. రాజప్రశంసయే నాకడ రాలేదు. మదనునే యాతఁడు నాపై నుసిగొలిపెను. అదను కాదని మదను నాపుచుఁ గపటప్రేమను బ్రకటించుచు ముందున్నది ముసళ్ళపండుగ యని యాశపెట్టుచు మానరక్షణ మొనర్చుకొనుచున్నాను. మదనుని కేల్వట్ట నేను ముఖత్వమును జూపక నాలసించుచుండుటచే నన్నితరు లపేక్షింప కుండుట కిట్టి యడ్డంకి సృష్టించిరి. నాసమక్షమునఁ దండ్రి కుమారునిఁ బ్రసంగం బొప్పుటయు నవాబువారించుటయు నెన్నడును జరుగ లేదు. బుద్ధిసాగరుని మాటల విని మీరు మోసపోతిరి. తమరెవ్వరు? తమ నామధేయ మేమి? నన్నుఁ గాపాడఁ గల్గిన వైళంబ దారితీయుఁడు.

దమ — సుదర్శన భూజానికి నేనును బుద్ధిసాగరుఁడును బ్రధానులము. నాపేరు దమనుఁడు. పోనిమ్ము. సుదర్శనుని బ్రేమాలకే నీన్గొంపో వలసియున్నది. బుద్ధిసాగరుఁడు వెలి పుచ్చిన దురభిప్రాయమున తేఁకు నీయెడఁ గట్టలుకం బూనితన్ను వరింపనంటి వను తామసంబున ముక్కుత్రాడుతో నీన్నీడ్చుకొని రమ్మని యాజ్ఞాపించెను. కన్యాత్వమునకు భంగము కలుగకుండ మెలంగు చుంటివని సవినయంబుగ సహేతుకంబుగ నృపునితో నచ్చంబల్కి వలచి వలపించుకొని రాణివై మెలఁగుము. దైవము నీకుఁ దోడగుఁగాత! రా రమ్ము. (చేతం జూపుచు) ఆపాలకీయం దేగి యాసీనవుగమ్ము. నేనిదె బోయులతో వచ్చెద.

చిత్ర — మహాప్రసాదము. (దమనుఁడు వెడలును)

చిత్ర — నన్నడసితి నను పరమహర్షమున దమనుఁడు మదనుని మాటయే మఱచినట్లున్నది. ఇంతవరకును పను లనుకొని నట్లు నెఱవేఱెనట్లే.

తే॥ గీ॥ చానరూపంబు మాటిచి ♦ జారచోరు
ల వలని భయమ్ము లేక మె ♦ లంగుచుంటి
సోదరికి నై వ్రతమును య ♦ శోదతనయ!
పాసితిని; గాచుటెట్లో? శు ♦ భంబదెట్లో॥

పూర్వాపరజ్ఞానశూన్యుండై దమను దుర్బోధనలం జిక్కి బుద్ధిసాగరుం బరిభవించిన జనపతి తన్ను వరింపననిన మదను రాణినని మోహముంజూడ నెల్లక వేగమే రొట్టి శిక్షను విధించునో? ఆ బుద్ధికుశలు ముఖావలోకన మునర్పక తప్పదు. ఈ సందర్భమున దమునికిం బరాభవముం గూర్చుటయు నవసరము. (యోచనన భినయించి) ఇప్పుడు మెదలునకు దట్లు యోచనయే బాగుగనున్నది. ఇట్లొనర్చెదంగాక.

(వెడలిపోవును)

(తెఱవ్రాలును.)

---

—* నాల్గవయంకము *—

---

తృతీయ రంగము.

(రాజమందిరము: సుదర్శనభూవిభుండు కనకమణిమయాసనాసీనుండై యుండు.)

సుదర్శనుడు—

శా॥ దూరాలోచనచేయకే నతసికే ♦ ద్రోహమ్ముఁ జేసి న
ట్లారూఢ నను దిట్టుచుందురట మే ♦ లూహింపకజ్ఞానులై
నోరారం బలుకాడ నుబ్బు జనులా ♦ నోరెత్తి లెక్కింపనా!
యే రింతా నపదిన్న గర్వితుల నే ♦ నీడ్పింతు శిక్షార్థమై॥

ఉ॥ రోజులుసాగుటన్ దమను ♦ క్రోవల కెయ్యదో విఘ్నసంచయం
బా జగడాలమారి సయి ♦ దమ్మదు దారసిలంగఁ జేసెనన్;
ఓజఁ గలంచె మానసము; ♦ నోటమి నిక్కువ; మేలు తుళ్లుటల్;
వ్యాజమె నిన్నె గూల్చు; సరి ♦ వాఁడవె నాకుఁ దురుమ్కపాంసనా॥

తే॥ గీ॥ సాహెంబు మనీఁడెగా బుద్ధి ♦ సాగరుని మ
నుచుట; చెలి విడిపింతు న ♦ నుచు శపథము
నూని నఁట తిండిమత్తత ♦ నూఁగు తురక
యుండ దయ్యె తెల్పు బలగంపు ♦ టతిశయంబు॥

(తెరలో) మహారాజా! వృద్ధపురోహిత సత్తముండగు రామశర్మగారు వాకిటను నిల్చి దర్శన మభిలషించుచున్నారు.

సుద—సేవకా! వారిని వేవేగఁ గొనిరమ్ము.

సేవకుఁడు—(తెరలో) చిత్తము.

(రామశర్మ ప్రవేశించును.)

సుద—తాతగారూ! దయచేయుఁడు. ఆయత్తాసన మలంకరింపుఁడు.

రామశర్మ—రాజా! దీర్ఘాయుష్మాన్భవ.

సుద—చిత్తము. (స్వగతము) ఎన్నఁడునురాఁడే; యీతెఁడేటికై వచ్చియుండును.

రామ—(లేచి నిలిచి) భూపాలా! మంత్రాంగనిపుణుఁడగు మంత్రిలేమి సభవెన్నెలలేని నిసివలెఁ జిన్నవోయియున్నది. అందు బుద్ధిసాగరుని తేజఃపటలంబునఁ దమమూర్తి ప్రకాశించుచుఁ గన్నులపండువుగ నుండెడిది. తమరునుదమతండ్రిగారును నాపైవారును దేశక్షేమమును, ప్రజల వాంఛితంబులును పాటించుచు, సంపూర్ణవిశ్వాసంబున కునికిపట్టులయి పరమానందమున జను లుబ్బూఁతలూఁగుచు రాజభక్తి ధర్మానురక్తులను సూచింప మంగళమహాశ్రీ లనుభవించిరి. నిన్న మొన్నటిదనుకఁ దమపరిపూర్ణానుగ్రహంబునకును, బితృస్థానంబున నధిష్ఠింపఁజేసి పూజార్హతకును, ప్రజాలోకంబున బాలాది వృద్ధపర్యంతము తలమానికం బని ప్రశంసాపాత్రతకును మూలమైన యమాత్యశేఖరుండగు బుద్ధిసాగర సుధీ మణిని బందినుంచుట ప్రజలలో నసంతృప్తికి దావలంబయ్యె నని మనవిచేసికొనుటకుఁ జింతుల్లుచున్నాను, వారు తమకును, దమకుటుంబమువారికిని నొనర్చిన సేవ వర్ణనాతీతము. తమ్మును బసికూనలప్పుడు హస్తగతంబొనర్చి యీబాలుని పురోవృద్ధికి మీరుతక్క నన్యులేరునులేరని యుష్మత్పితగద్గదకంఠనినాదంబున వాక్రుచ్చ నీధీసంపన్నుఁడు హాఁరుమని యేడ్చి నాగొంతుక నూపిరియున్నంతవరకుఁ గంటి కగు ఱెప్పనై కాపాడెదనని వాగ్దత్తమిచ్చె. ఆమహామహునికా యిట్టి యిక్కట్టు! తమబాల్యమునఁ బరరాజులు పైకెత్తిరా విచ్ఛిన్న దశ

యందు సామ్రాజ్యమునకుఁ బట్టుగొమ్మయై నిలిచి ప్రాణముల నర్పింప సిద్ధుండై రణాంగణమునఁ బ్రళయకాల రుద్రునివలె నిలిచి వైరుల నుక్కడగించి నందులకా యీనీచకారాగృహవాసము! వారొనర్చినది తప్పుగాదనియు, ప్రభువుల కతఁడు ఏయత్యంతాల్ప కారణముననో ద్రోహసమన్వితుండని నమ్మిక గల్గినను తన్మూలమున వాతని యమాత్యపదవి కేలోటును సంఘటింపఁజేయుట శాస్త్ర విరుద్ధమనియుఁ బ్రజలైకకంఠముగ నభిప్రాయపడుచున్నారు. వ్యక్తులకుఁ గల్గిన విముఖత్వమున రాష్ట్రమును విపద్దశకుఁదెచ్చుట యన్యాయము. వారిలేమి యనర్థము వాటిల్లఁజేయునని ప్రజలు దృఢవిశ్వాసమును వెలువరించుచున్నారు. కావునఁ బ్రభువులు శాంతచిత్తమును వహించి ప్రజల మొఱ యాలకించి దుష్టప్రబోధంబులకుఁ జెవులొగ్గక "ప్రమాదోధీమతామపి" యందురుగాన పశ్చాత్తాపమును వెలిఁబుచ్చుచుఁ బ్రధానమంత్రిని విడుదలచేసి యథోచితంబుగ వారిపదవి యందున వారి నలంకరించి, చిందరవందరమైన వారికుటుంబము నొక్కెడఁజేర్చినఁగాని ప్రజారంజకులను నామము తమరుదక్కించుకొనఁజాలరు. తమపరిపాలనలో నున్న వారెల్లరు నిట్టిదాని నపేక్షించుచున్నారు. బుద్ధిసాగరుఁడు కరుణామయుఁడు. ప్రేమించి విశ్వాసమును సేకరించుకొనెను. పరమశాంతుఁడు. అపకారికేనినుపకారమే కూర్చు నుత్తమ పురుషశ్రేష్ఠుఁడు. అతఁడే లోకబంధుఁడు. శమదమాది సద్గుణ సంపన్నుండగు నా యవతారపురుషుని వారముదినములలో, పాలితుల విజ్ఞప్తి దివ్యచిత్తమునకుందెచ్చి స్వతంత్రు నొనర్పుఁడు. రాజభక్తి పరాయణులగు మాబోంట్ల కలజడి ఘటింపక శ్రీవారే యుచితరీతి మెలంగ సర్వేశ్వరుఁడు ధీసంపన్నులం జేయుఁగాత! రాజా! ప్రజలసంతకములతో నిట్టి విజ్ఞాపనాపత్రములు తమసమ్ముఖమునఁ జేరినట్లు వింటిని.

మద—భూసురశ్రేష్ఠా! గుణగ్రహణపారీణు లొండొరులు లోపా లోపంబుల దిద్దికొనుట ప్రశస్త కార్యము. నవరసపూరితంబై

ప్రణుతి పత్రము విరాజిల్లుచున్నది. సావధానముగఁ దమవాక్యంబుల నాకర్ణించితి. ఉచితరీతి వ్యవహరించెద.

రామశర్మ — రాజా! వయోవృద్ధుండనై పదచలనముమాని త్వదాశ్రయమువలన లభించిన యుక్తియుభాగ్యోదయమున సర్వ సౌఖ్యంబుల ననుభవించుచు శ్రీరామ సంకీర్తన మొనర్చుకొనుచు సుఖినైయుండియు ప్రస్తుత సంక్షోభమును విని నా నేర్చినకొలంది విన్నవించుట విధియని బయలువెడలి వచ్చితిని.

సుదర్శ — మంచిది. పిన్నలకు సన్మార్గము లుద్బోధించుట న్యాయమే కదా? మీ హితము వందనపూర్వకముగ నందుకొంటి.

రామ — భూపాలా! నేను పోయివచ్చెదను. సెలవ్వొసంగెదరా?

సుద — స్వామీ! నమస్కారములు.

(రామశర్మ వెడలిపోవును)

సుద — ఓరిపిడుగా! వచ్చితురకా! కాలమహిమ నిన్నంతవాని నొనర్చెనురా! ప్రజానాయకుఁడవా! నీకు దోడుగా నెందఱి మతులం జెఱిపితివి.

తే॥ గీ॥ పూర్వులార్జించిపెట్టఁగా - బువ్వమెక్కి
ముండ్రగాసముఁదినుచును - మూలనక్కి
గడ్డపుంజీర పేలన - ఖాలఁ గ్రుక్కి
నాయకుఁడవై తె నీదుప్రా - ణము పలుకక్కి॥

ఈయల్పునితో నేమిగాని బుద్ధిసాగరునియెడ నే కృతఘ్నుఁడన్నమాట నెమరునకు వచ్చినప్పుడు హృదయము దహించుకొనిపోవుచున్నది. అయ్యో! పాపమాన దివుఁడేల కన్యాన్వేషణంబునకుఁ గడంగె? కడఁగిన మాత్రమున వారింపక నే నేల యియ్యకొంటి? ఇయ్యకొన్న మాత్రంబున నిట్టి విపర్యాసంబులేల ప్రాప్తించవలయు? ప్రాప్తించెఁబో విభుఁడ నగు నేను మదన తాపజ్వరంబున మండిపడ, శాంతవచనంబులను శీతలోపచారంబులఁ దప్తుండనగుటకు మారుగ నీర్ష్యాగ్రస్థుండగు దమను తీవ్రవాక్జ్వలధిఁబడి తెప్పతిల్లలేక సుడిగుండంబునఁ బడితి. దమనా

ఆ నిమిషంబున నంకురించిన యాగ్రహానలముఁ జల్లార్పక ఏ రాజ మానసమై వెలుఁగ రోషతైల తప్తంబులగు వత్తులోయనఁ దీవ్రభాషణంబుల నతిక్రమించుచు నా తను సర్వస్వముపైఁ బూర్ణాధికారమును నిర్వహించి బుద్ధిసాగరునిఁ గారాగారంబునందోయించితివి. చిక్కులఁ దెచ్చిపెట్టితివి. సామాన్య పరిస్థితులనే స్థిమితపడుచుటకు నేతిలోఁ బడ్డ యీఁగవోలె గిలగిలలాడుదువే యిప్పుడేమందువు? అయ్యారు బెండ్లియయ్యె నను సంతసమేగాని సవతి తల్లిపోరు గుర్తింపలేదన్నట్లు బుద్ధిసాగరుని సాధించితి నను మురిపమేగాని రాజ్యరక్షణా పాటవంబల్పంబుగఁ దోఁచెడి. ఇట్టి యాందోళన విషయము వినిపింపవైతివిగదా.

సేవకుఁడు—(తెరలో) జొహ్మోసాలా! హాజారముకడ నుజ్జయినీపురంబు నుండి దూతవచ్చి దర్శనమునకై నిరీక్షించుచున్నాఁడు.

సుదర్శనుఁడు—సేవకా! వారిలోనం జేర్పుము. ఉజ్జయినీవారు నా ప్రతాపమువిని మందలింపు పంపియుందురుకదా.

[దూత ప్రవేశించును]

దూత—రాజశేఖరునకు వందనములు. జయము గలుఁగాక! నేను ఉజ్జయినీ పురంబునుండి పంపఁబడితిని.

సుద—దూతకార్యధురంధరా! ఆ పీఠమలంకరింపుము. ఆగమన వార్తల వివరింపుఁడు.

దూత—ప్రభువర్యా! మాస్వామివచనంబు లవధారుఁడు.

ఉ॥ వార్తవినంగనా సుగుణ ♦ వారిధిచంద్ర; సుదర్శనాఖ్య! సత్కీర్తిలతల్ దిగంచల వి ♦ కీర్ణత గాంచిన బుద్ధిసాగరున్
ధూర్తుఁడవై చెఱన్ బడఁగఁ ♦ ద్రోసితి వంచుఁ బ్రజాళి విన్నపం
బార్తినిబంపె మాకు నచి ♦ వాగ్రణి వేగ విముక్తుఁ జేయఁగన్॥

శా॥ సారాంశంబులఁ జాటి చూచి మగుడన్ ♦ శాసింపుమీ వీడుకోల్
భారంబౌ ప్రజ నాకఁ బోవుట తుదన్ ♦ వారెల్లనో కుమ్మరిన్
మీఁదుగా, మనలో నెవండో రిపులన్ ♦ మేలందఁ దాఁగూడు నే
తీరుల్బూచినఁ జేటు; మంత్రిచెఱి పు ♦ త్తెంచన్ తమింపన్ దగున్॥

శా॥ ఆమంత్రీంద్రునకున్ సమానునిలలో ♦ నార్యా! కనంబోము నీ
క్షేమంబెంచి వచింతు, నాతఁ డగు నీ ♦ జీవంబు; నీ వైరు లా
నామంబన్న వడంకి పైకురుకు టే♦ నాఁడా యటంచున్న వా;
రేమాయం బడఁబోక యా ప్రథితు నే♦యెన్నందగున్ మంత్రిగన్॥

తే॥ గీ॥ చిన్నవాఁడవు నీవు స ♦ చివు ననుపమ
గుణనిధానమాళి విడిచి ♦ కొందలంబు
చేతులంగొని తెచ్చెడి ♦ సీతఁగాంచి
మేలుఁ గోరుచుఁ దెల్పితో ♦ మిత్రవినుము॥

తే॥ గీ॥ స్వార్థమును నెంచి లెనుఁ దన ♦ యండమఱచి
యేన్గుపైన జవ్వాజినా ♦ నెగు ముఖమున
దీపముండఁగ వెదుకఁగఁ ♦ దివ్వుగునట్టి
మంత్రి శేఖరు లెందఱో ♦ మహినిఁగలరు॥

తే॥ గీ॥ ప్రభువునెడ భక్తి ప్రజలనఁ ♦ నాదరక్తి
పరధన విరక్తి, శత్రులు ♦ వణఁకు శక్తి
న్యాయమందున నాసక్తి ♦ నమితయుక్తి
బుద్ధిసాగరుఁగూడి ప్ర ♦ సిద్ధిఁగాంచె॥

సుదర్శనుఁడు— రాయబారీ! మీస్వామివారి యమూల్య వాక్యరత్నంబుల శ్రద్ధాళువునై యాలకించితినని వివరింపుము. నీతివాక్యంబులకు వందన శతంబు లర్పించితి ననుము. నీ వేఁగుము.

దూత— చిత్తము.

[రాయబారి వెడలిపోవును]

సేవకుఁడు—[తెరలో] స్వామీ! దమనామాత్యుఁడు విచ్చేసి లోనం బ్రవేశింపఁ గోరుచున్నారు.

సుద— సేవకా! లోనం జేర్పుము. చిత్రరేఖను జిత్ర విచిత్రగతులం బరిభవింపవలయు. కసిదీర్చుకొనవలయు.

[దమనుఁడు ప్రవేశించును]

దమ— రాజా! జయమగుఁగాక.

సుద— మంత్రివరా! చిత్రరేఖయేది?

దమ—పల్లకితో మీా పడకటి గదిఁ జేర్పఁబంపితి.

సుద—అదేటి విపరీతము?

దమ—మనవినాలకింపుఁడు. చిత్రరేఖ మదనుని కేల్వట్టలేదు. తమ మాటయాపెతో నాదుష్టుఁడు వచింపనేలేదఁట. మదనుని వరింపు మని నిర్బంధించుచున్నాఁడఁట. నేర్పుతో మానరక్షణ మొనర్చు కొనుచు, ఆగుదిబండనువదలించుకొనఁజాలక,విలపించుచున్న ట్లాపె వచోధోరణి సమ్మతి మొదవింపఁ గాని తెచ్చితి. తమరును విచారణ సల్పి గర్వాత్ర్యమనిత్రోఁచిన రీతి మెలంగుఁడు.

సుద—మంచిది. నే నిదె యాశ్వంగారవతిం గన నేగెదను. నీవును నేఁగుము. బుద్ధిసాగరుని పరోక్షమునఁగాని యిట్టిది జతపడదని విధి యాతని కాగతిఁ గల్పించెఁ గాఁబోలు.

[ఇరువురు నేగుదురు]

[తెర వ్రాలును]

---

## —* నాల్గవ యంకము *—

---

చతుర్థరంగము.

[సుదర్శనుని పడకటిగది—సుదర్శనుఁడు నిలిచియుండును.]

సుదర్శ—

ఉ॥ ఎవ్వరికేరొ, వారి లగి ♦ యించు విరించి సులగ్నమందు నీ
జవ్వని నూనునిం గలుపఁ ♦ జాలెన మంత్రిశ్రమంబెగాని, పైఁ
జివ్వకుఁ గారణంబు, చెలిఁ ♦ జిక్కుట సంభవమయ్యె శక్యమే
దివ్వవిధాతవ్రాలు నరు ♦ చే మతిఁబోయిన చేష్ట లిట్టివే॥

తే॥ గీ॥ నిప్పుత్రొక్కిన కోతినై ♦ నీచభాష
లాడితినటంచు దమనాఖ్యుఁ ♦ డాడియుండ
రసికతకును సందేహ మే ♦ ర్పడియె నేను;
తప్పుసైరించి యొప్పుల ♦ కుప్ప రావె.

తే॥ గీ॥ మర్త్యలోకంపు మదను స ♦ మాగమంపు
నిరసనపు టూహ గుసుమంపు ♦ శరునిదూరి
తోలితినటన్న నినుక నా ♦ తోడఁగూడ
వేగిరింపకు కాంబోలు? ♦ వెలఁదినిన్ను॥

కన్యామణీ! పర్యంకికనుండి యీవలి కడుగిడి నను ధన్యం జేయుము. కామదోషాంధకారము వ్యాపింపఁ జీకటిఁ బడియున్న నన్ను నీ వదనశశిం జూపి దాగి జూపఁ బుయిలోడకు. రా రమ్ము. చిత్రరేఖా! చిత్రరేఖా!

తే॥ గీ॥ కోలుపోయితి నీకునై ♦ గుణవదాన్య
ప్రజల శిక్షలమగుభక్తి ♦ పడఁతిమిన్న
ఆలసించుట తగవె నీ ♦ వైనఁ గనవె
వసియెటులైనఁ దక్కితి ♦ వింతెచాలు.

తే॥ గీ॥ పిలిచిన కొలంది బిరుసుఁగ ♦ బిగిసికొనుట
కతినులా పురుషులకు యు ♦ క్తమ్ముగాని
మంచుపోలెను గఱఁగెదు ♦ మగువ మనము
గడుసుఁదనమిట్లు బూన నా ♦ కర్మఫలమొ॥

[పురుషవేషమున శశిరేఖ ప్రవేశించి]

తే॥ గీ॥ కర్మఫలమే సుదర్శనా ♦ ఖ్యా విజంబు
వివిధబుద్ధులఁ బొడమింప ♦ వెఱ్ఱిఁజేసె
చాలనిగ్రహాళి నడకల ♦ చాయ లివియె
దమను మాయయెగాని నే ♦ తరుణిగాను.

సుద—(పురుషునింగాంచి నివ్వెఱపడి అమితోగ్రుఁడై, హుం అని పండ్లుకొఱకి) ఓరీ సేవకా! ఎవఁడురా అక్కడ?

సేవ—చిత్తము. ఆజ్ఞనెఱవేర్ప సంసిద్ధుఁడనుగ నున్నాను.

సుద—ఆ మేజాపైని కలమును సిరాబుడ్డియు నొక కాగితము నిట్లందుకొనుము.

(సేవకుం డందీయ రా జేదియో లిఖంచి) సేవకా! దీని నత్యంత రయమున సేనాని కడకుం గొనిపోయి యిం దుదహరించిన రీతి

నుత్తరక్షణంబున మెలఁగు మనుష్యు. మహానీయా! తమరెవరు? ఇటఁ
దామెట్లు చేరితిరి?

పురు — రాజా!

తే॥ గీ॥ ఏను బంధువాదును కళిం ♦ గేశునకును
వేఁటకై వచ్చి నావారి ♦ వీడవలసె
దారిఁదప్పుట బడలికన్ ♦ దాహ మొదవె
నీరుఁగ్రోలితి, కాసార ♦ తీరమందు
పవ్వళించుచు తెలియు దా ♦ పై నెఱుంగ॥

సుద — మహాశయా!

ఉ॥ తాపస మొందకుండు తమ ♦ దారినిఁ బుత్తు మనీషచంద్రమా
క్షేమముగాఁ బురిం దమరిఁ ♦ జేరుప నాజ్ఞలనిత్తు రంతు మా
గీయునఁ జిన్న వింశుగాని ♦ గేహము శుద్ధతరంబుఁ జేయుఁడీ
నా మనవిం గ్రహించి దమన ♦ ప్రథితుల్ క్షమియింప నెంచుఁడీ!

(ఇరువురును వెడలుదురు.)

(తెరవ్రాలును).

# బుద్ధిసాగరవిజయము.

## పంచమాంకము.

ప్రథమరంగము:— చెఱసాల.

[బుద్ధిసాగరుఁడు శైలుదుస్తులతోఁ జింపిరిచాపపై
నాసీనుఁడై యుండును.]

బుద్ధి—

మ॥ దివికిన్ జేరిన వృద్ధభూధవునితోఁ ♦ దీయంపు వాగ్జాలముల్
చెవులారంగ వచించితిన్ సుతుని ర ♦ క్షింతున్ జుమీ తప్పకం
చు, వచోభంగము సంఘటించెఁగద హా ♦ క్రూరుండెయంచుం దురీ
బవిసిం జేతులఁ దెచ్చుకొంటి విలపిం ♦ పం గారణంబున్నదే॥

ఉ॥ నమ్మినవానినిం జెఱిపి ♦ నాఁడను, దుష్కృతులబ్బె, నబ్బురం
బమ్మక చెల్లయుం చనఁగ ♦ నాదరు వెడ్డయుఁ గాన దాపదల్
గ్రమ్మ భరింపఁగావలయుఁ ♦ గారకు లీరవికాని వారిఁదీ
ప్రమ్ముగ దూరుటల్, పరమ ♦ పాతకమందునఁ బాదుకొంటయే॥

ఉ॥ అన్నము పున్నమున్ దెలియ - వర్భక! అమ్మదుఖాను కుద్రయై
ఉన్నన సన్నగంబుల జ - వంబున మార్కొనశక్తి యున్న నే
నన్నిటి కోడఁ గారకుఁడ - నంచను సాకట మంతరంగము
న్దెన్ని విధాలఁగుందిడునో - ఈశున కెల్లయు గోచరంబెగా॥

తే॥ గీ॥ వల దరాజకంబౌదవు న - వాబ యంచుఁ
జెడ్డపేరొందవుట భువిఁ - జెల్లదంచు
వేవిధంబులఁ గబురంప - వీడఁడాయె
షట్టుషట్టిరి ప్రజలేక - భావులగుచు॥

ఉ॥ లోకములోన నందఱు వి ♦ లోకనఁ జేతురె దూరదృష్టి, నే
నీ కలహాన కంతటికి ♦ నిక్కగ భావనఁ జేసి దూరరే;
మేకొని "తిట్టగ్రుద్దినటు" ♦ మ్లేచ్ఛసహోదరు నాయకత్వ మీ
యేకపు భావమున్ గుదిరె ♦ నే చెలఁ జేరఁగ దైవికంబుగన్॥

మ॥ ఎవరెల్లించిన నేమి లోటు? భువనా ♦ ధీశుండు మత్కృత్యముల్
గావలోకించిన నాకు నేయఘము పా ♦ త్రా పాత్రమై యొప్పునో
భువనంబందునఁ గీర్తి పోయినటులే ♦ పోరం జయంబబ్బినన్
యవనిశ్రీధవు నార్జితంబనుచు నీ ♦ త్యజించరే భూజనుల్॥

అయ్యో! నామిత్రులు వినక భూమ్యాకాశంబుల దామే నింపి విశ్వప్రయత్న మొనర్చుచున్నారు కాని

సీ॥ ఆత్మలశోధింప ♦ నవకాశమును గూర్చి
పరితాప మొదవించుఁ ♦ బరమపదము
కష్టంబులం దించి ♦ కలుషఫలంబని
గతమును దలపించుఁ ♦ గార్మణంబు
అత్యాఘుచయముల ♦ ఖండింప శిక్షలన్
శమనుఁడు ధరఁగల ♦ జ్ఞానమఠము
పరచింతలను మాని ♦ పరమాత్ము నెద నిల్పి
జపియింపఁదగు కృష్ణ ♦ జన్మభూమి
తే॥ గీ॥ నిర్మలాత్మను, గర్మంబు ♦ నిగిడి తెలుప
సద్గతులఁజూప, శాశ్వత ♦ సహనమోరి
మి మొదలగు సద్గుణము లీన ♦ మేటిగురువు
బంధనమె! వలవదు ప్రతి ♦ బంధకంబు॥

ఈ ప్రాంతముల కెవ్వరినో నూతన బంధితునిఁ గొనితెచ్చుచున్నట్లు భటుల హుంకారములును గద్దింపులును గొలుసుల చప్పుడులును వినఁబడెడి.

(దమనుఁడు వేత్రహస్తుల మధ్యగొలుసులచే కాలు సేతులు బంధింపఁబడి ప్రవేశించును.)

బుద్ధి—(లేచి నిలిచి అమితాశ్చర్యమున) ఏమిది! వాకనులు నన్ను మోసగించుచున్నవా! నిక్కువమా!

దమ—మహాత్మా! క్షమింపుము. ద్రోహిని; ద్రోహిని. అసమానుఁడ వనియును, నిరుపమగుణోపేతుఁడ వనియును, యెఱిఁగి యెఱిఁగి, యనిమిత్త వైరకారణ మోర్వలేమిచే సహించి మీకపకార మొనర్చితి. తత్ఫలానుభవమునకై యచిరకాలంబున నటఁ జేర్పఁబడితి. ధర్మాత్ముఁడవగు నీకెగ్గులం గూర్ప దీర్ఘపరిశ్రమ యొనర్చి నిర్వహించితినని మూఁడునాళ్లు మురిసితిని. పరులను నిష్కారణముగ వనటల పాల్పడఁజేసిన పాపము రిత్తవోవునే?

బుద్ధి—అయ్యో! సందేహమేల? ఈతఁడు దమనుఁడే. ఓ దమనా! ఏమి యీయాగడము! రాజ్యలక్ష్మి సుదర్శన భూజానినిఁ ద్యజించు సమయమేర్పడెనా! మంత్రి లేని రాజ్యమా! నిక్కువముగ సుదర్శన భూధవుఁడు కామాంధకారమున మునింగి మైమఱచె. ఆలోచనలుడుగంబె; అక్రమమధికమయ్యె. మంత్రివర్యా! తమ కిట్టి స్థితి యేలఁ బ్రాప్తించె?

దమ—పాపాధముఁడనగు నేను మీకు ముప్పుంగూర్చుటలోఁ దనివిఁ జెందక యుసురులు దక్కించుకొన విపినంబులఁ జేరిన మదన చిత్రరేఖలం బ్రభువును సంప్రీతాత్మునిఁ జేయుఁ బట్టి తేఁగడంగితి. వెదకి వేసరి తుదకొక వనమధ్యంబున వారిం గాంచితి. దాన హర్షపులకిత శరీరుండనై వేదండము నెక్కినట్లు కరతాళము నొనర్చి తనువును మఱచి చిత్రరేఖను గొంపోయి విభుని మందిరమునఁ జేర్చితి. చిత్ర మాళగవానుని కెరుక. చిత్రరేఖయని మందిరమునఁ జేర్పఁబడిన స్త్రీ విభుని మోహంపు బురుషుండయ్యె. ఇది నామోసమని ప్రభువు సాగ్రహుఁడై, పిలిపించి విషయంబులనేని విచారింపకయే, యుంట నున్న నన్నింటి నుండియే పురమంతయు నడపించుచు గారాగృహ ప్రవేశ మొనర్ప భటులఁ బంపె. సత్పురుషున కపకార మొనర్చిన

పాతకియగు నీ పౌరులెల్లరు నాస్థితికి పరమ హర్షంబును సూచించిరి. దయాళుఁడవగు నీ వొక్కఁడవే హాసింపకున్నావు.

తమయెడ సర్వజనులకుఁ గల ప్రబలభక్తిశ్రద్ధలచేఁ దమ శత్రువునగు నాకుఁ జేకూరిన యిప్పటిస్థితికి మీరు తప్ప 'నన్ను గోపాడు'మనిన వా రెవరు లేరు. నీ వజాతశత్రుఁడవు. అలనాఁటి యజాత శత్రునకుఁ గృష్ణభగవాను నట్లు నీకు యోధుఁడగు తురుష్క సహాయుఁడగుచు వ్యవహరించుచున్నాఁడు. మూల విరాట్టువగు సిద్దాపి లోకుల చూపుల నాకర్షించి సంఘీభావములఁ గుదిర్చి బొటనవ్రేలిక్రింద నణఁచి యుంచుకొనెను. ఇట్టి నాయకుని గని విని యెఱుఁగము. సైతానను కొనిన యాతఁడు సహస్రాత్ముఁడై వెలసెను. రెండు దినములలో నీకు మోక్షము సంప్రాప్తమగును. నా దోషమే వ నిర్జింపఁ జేసి హరించు.

భటులు—అయ్యా! నడువుఁడు. మా యధికారి ఆలస్యంబునకై ప్రశ్నించును.

(దమానుఁడు భటులు వెడలి పోవుదురు.)

(తెరవ్రాలును.)

---

—* పంచమాంకము *—

---

## ద్వితీయరంగము.

(నవాబుగారి దేవిడి.)

(బురుజుపై నవాబుగారును, రామశర్మయు నిలిచియుందురు.)

రామశర్మ—సాహెబ్ మసీఁడా! తండోపతండంబులుగ మూఁగుచున్న జనసమూహము గాంచితిరే. సముద్రంబుపోల్కిఁ బొంగి పొరలి వచ్చుచున్నారు. కారణము గడచిన రాత్రి తమ్మును బంధించిరని దిశలెల్ల మాఱుమ్రోసెనఁట. యథార్థమెఱుంగ వచ్చుచున్నారు.

నవాబు—అరే! శర్మావార్! అల్లా! ఎంతాజరం! ఎంతాజరం వచ్చాయి! బుద్ధిసాగర్కీ మేం మిలాఖత్ కావటంలో మేరానాం పైకివచ్చార్. ఆయన మహాత్తం ఏంచెప్పాలా.

రామ—తురష్కచంద్రమా! తమరెలుగెత్తి పల్కినంగాని వారుశాంతి వహించి గృహోన్ముఖులుగారు.

నవాబు—ఏ! భాయిలోగ్. అందర్కీ మీకీ సలాంచేసాం. బుద్ధిసాగర్కీ మాకీజోస్తీ యింతవాడ్కీ హై. ఆయనగార్ ఖైదికి యెల్లాటంతో మేం ఉపార్ తిన్నాం. రాజు అన్యాయం జర్గిపించారని అల్లాలోపించార్. మాకీ మాటఅన్నాం. మీకీఅంతాసైచెప్పటం ఆధారంపుచ్చాకోసి కసిమే దగాం. జయంపొందాంఅన్నమాటే. నాకీపట్కెల్లారన్నలో యింతజనం లోస్కరావటం జయంగాదూయే? వాయిదా చెప్పాం, బుద్ధిసాగరు ఎల్లూచెప్పాలో రాజుమన్కీఏకం, నైతో రాజుగార్ఒక్కటి, మనంసాబ్బిఒక్కటి. ఆయనకీమా కోస్బిచూడం. రాచెప్పం. పోచెప్పం. ఉండూంచెప్పం. కరిచారక్ కోస్బియెల్లర్. హాయ్యగార్ హెండి పోవాలా. హల్లీ రాజు మాకీపట్టూచెప్పాలో పట్టేవాలా కోస్బినై హైకమత్యం హంతాహచ్చిగా ఎక్కీపో యార్. మనుసుల్మే, మాకీకులాసామే యున్నామ్. దయా యుంచి మీరు హిల్లాకుఎల్లుండి. దైవంరక్షణభీచేసాతో ఎంతమాత్రం ఫర్నై. మసదిల్ పకారం పనీ జర్గిపించాలని ఖైవంకీ పారాధనా చేపించటం అవసరం. సలాం; సలాం.

(బురుజుపైనుండి నవాబును రామశర్మయు దిగిపోదురు.)

(రామశర్మ వీరవర్మలు ప్రవేశింతురు)

వీర—శర్మా! ఈశశిభూషణుండెవండోయి?

రామ—కళింగాధీశుని బంధువంట. చిత్రరేఖకై నవాబునకు దోడ్పడు చున్నాడు.

వీర—చిత్రరేఖ దమను నెంత మోసగించెనోయి!

రామ—అట్లు నమ్మక ముదవ మాటాడకున్న నీతండు బొందకుడు నెట్లు? పడకున్న శశిభూషణు సంహరించి తాం దప్పించుకొనుటెట్లు?

మన్నుదిన్న పామువలెగున నున్న నీ నవాబింతటి రాజ్యతంత్రజ్ఞుడని చాటుటకే యీ నూతన వికల్పము ప్రాప్తించెఁ గాబోలు. అతి తేటిన వానికన్న నేను రెట్లు మిన్నగ సామర్థ్యమును బ్రకటించుచున్నాఁడు. ఇన్నాళ్ళీతఁడిట్టివాఁడని లోకమున కపరిచితుఁడు గదా? ఏపుట్టలో నే పాముస్నదో కనుగొనుట దుర్లభమనుట యిందు కొఱకే.

వీర—శశిభూషణుఁడు నేర్పరియే. నిముషుని సహలీలఁ జిక్కినఁ ద్రోయుంచె. "నవరత్నములన్నియు నొక్క చోటను సత్తుగుల్లలొక చోట" నను సామ్యము వినలేదా? దైవ మనుగుణముగనే పొత్తు గూర్చుచుండు.

రామ—రాత్రి ఇంకొక రహస్యము జరిగె.

వీర—అదెయ్యది?

రామ—మదన చిత్రరేఖలు నవాబు గృహమునం జేరిరి.

వీర—బలే బలే. సంతోషవార్త. ఎట్లొనఁగూడెనోయి?

రామ—నవాబుగారి యాజ్ఞలఁ దీర్చ మన మేగుదము రమ్ము.

[రామశర్మ వీరవర్మ లేగుదురు]

[తెర వ్రాలును]

---

—* పంచమాంకము *—

---

తృతీయరంగము.

కారాగారము:—[బుద్ధిసాగరుఁడు దైవధ్యానతత్పరుండయి కనులు మూసికొని సమాధియందుండును] [స్థిమిత చిత్తము లేనట్లదియో యోజించుచు సుదర్శనుఁడు ప్రవేశించును.]

సుద—[బుద్ధిసాగరుని వైపుంజూచి] ఔరా! ఈతని సామర్థ్యము బాహ్యప్రపంచమున నవీనునట్లు మెలంగుచు నఖండ ధురంధరత్వంబున రాజ్యపాలన మనన్యసామాన్యంబుగ నిర్వర్తించి యనశ్వరకీర్తిం గడించె. ప్రపంచమునకు దూరుఁడై, విషమస్థితికై

చింతింపక ప్రాచీనవట్లాధ్యాత్మిక శక్తివలనరించుకొని భక్తియుక్తుఁడయి నిశ్చలసమాధిని భగవదారాధనయందు నానంద మొందచున్నాఁడు. శ్రేష్ఠతమమగు సూక్ష్మబుద్ధిని నిందిరేశుఁ డనుగ్రహించిన బరిపరివిధంబులఁ బడి ట్లుపాదరసమువోలెఁ బ్రాకించుకొననగు. 'జట్టున్న యమ్మనే కొప్పెవ్వంబెట్టఁగలదు.' నేను దుర్మార్గుఁడనై యెగ్గొనర్చినను నా యెడ నీతఁ డెప్పటికిని కరుణామయుఁడే గాని కోపోద్రిక్తుండు కాఁడు. నిరంతర ధ్యాన పరతఁ బరంధాముని కైంకర్య ప్రాప్తిని సర్వమును మఱచి విరక్తింగాంచియేమనునో? ఐన నిట్లొనర్చెద. సేవకా! సేవకా!

**సేవకుఁడు**—చిత్తము. ఆజ్ఞల శిరసావహింప సంసిద్ధుఁడుగా నున్నాఁడను.

**సుద**—కారాగృహాధికారిని బిలువుము.

**సేవ**—చిత్తము.

[కారాగృహాధికారి ప్రవేశించును.]

**కారా**—ప్రభుసత్తమా! నమస్కారములు.

**సుద**—బుద్ధిసాగరుఁ డున్న గది కవాటమును దారి తపస్సమాధికి నిర్విఘ్నంబుగఁ గడు మెలఁకువతోఁ దాళము తీసి తెఱవవలయును.

**కారా**—చిత్తము.

(నేర్పుతో నట్లొనర్చును.)

**సుద**—నీవిఁక వెళ్లుము. మరలఁ బిలిపించెదను.

**సుద**—(బుద్ధిసాగరమూర్తిం గాంచి) అయ్యో! నేనెంత నిందాపాత్రుండనైతిని! ఏమి నా పితృసమానుని దుస్థితి!

తే॥ గీ॥ విలసిత సుభోగికకట చిం ♦ పిరిదిచాప
మోటు గొంగళి ముఱతయు ♦ మూఁకుడులును
గూర్చితిని నా వివేకమ్ము ♦ గూలిపోవఁ
బ్రాకృతుల కది భారమై ♦ వనటఁ బెంచుఁ
గాని మంత్రి కర్హాని సు ♦ జ్ఞానగాఁడె॥

తే॥ గీ॥ మంత్రిగానుండి శ్రీశు నా ♦ ము బుద్ధులఁప
క్షణము తీరక వర్తించి ♦ సావకాశ
మబ్బెనంచని మురియు చా ♦ హ్లాదవార్ధి
నవశశియునంగ స్మేరాన ♦ నమున వెలుఁగు॥

తే॥ గీ॥ వెలగల దుకూలముల వేయు ♦ విత్తహాతు
డంగికేకయె చెడ్డి దా ♦ ల్పం గలింగి
మాఱురూపమ్ముఁ బూనె నా ♦ మహిమ యుడిగెఁ
బాయునే వన్నె మణి మసి ♦ పాతనున్న॥

నా ప్రార్థన నీతఁ డంగీకరించునో లేదో కదా. నా తప్పిదంబుల మన్నించునట్లు దైవమా! యాతనికి బుద్ధిఁబుట్టింపుము. దూరాలోచన యొనర్పక మిడిసిపడితి. తల బొప్పెలు కట్టినది. ఈ ప్రయత్నంబునఁగూడ వంచింపకుము. దైవమా! శ్రీశా! నీ పదములే నమ్మి ప్రస్తుతించెద. భంగపాటొదవించితేని ప్రాణములపై యాశ లేదు. బుద్ధిసాగరుని సాయముం గూర్చి శుభంబు లందఁజేయుము.

తే॥ గీ॥ తడిసి గుడిసెకట్టు నొరఁగుఁ ♦ దాఁక నగ్రు;
తాకివచ్చుట నమ్మించు ♦ దాఁక వేఱు
శరణమును లేక శ్రీ బుద్ధి ♦ సాగరాఖ్య!
పాద పద్మాలఁబడితి నీ ♦ వాదుకొనుము.

ప్రసన్నుఁడవగు దాఁక లేవఁబోను. (సుదర్శనుఁడు సాష్టాంగపడును)

బుద్ధి—(ఇంచుక తడవునకుఁ గనులు తెఱచి) ఆ ఏమిది! నా మందిర ద్వారము తెఱచియున్నది. (పదములకడనున్న వారిం గాంచి యదరిపడి లేచి జాగ్రత్తగ నంగిచూచి చేతం దట్టుచు) నాయాన సుదర్శన భూపా! మొక్కు లందం దగువాఁడవు పాదాక్రాంతుండవగుటయా! లేలెమ్ము. (సుదర్శనుఁడు లేచి నిలుచును) రాజా! ఇదేటి విపరీత కృత్యము! ఇట్లేల యొనర్చితిరి?

సుదర్శనుఁడు—మంత్రివరా! ఏమి చెప్పుమందువు? మతిపోయినది. అసంఖ్యాకంబులగు నాయాసంబులు నన్నాటపెట్టెడి. నన్నుమించిన

యోచనలో మునింగిపోయి దరిఁగానక తల్లడిల్లుచు నీవే తరుణోపాయంబని నీపాలంబడితి.

ఉ॥ దాసుని తప్పులన్నియును ♦ దండముతో సరియన్నయట్లు నా
వేశముపూని నాదగు వి ♦ వేక విహీనదశన్ సహించి, సం
దేశము నాలకించి, చను ♦ దేరఁగదయ్య; క్షమావకాశమా
నాశనహేతు వా జనుల ♦ నాయకుఁడే? నృపుఁడే? తరాజునే॥

ఉ॥ నాయపచారమెంచక చ ♦ నందగు మీపదవిన్ గ్రహింపక, ని
న్నాయుట, శిక్షయుంచుటయుఁ ♦ బాలితులెల్లరు నెత్తుదెంచి ర
న్యాయమటంచు, నా ప్రజన ♦ వాదము విన్న నృపాళికూడ నా
కూయు సమంజసంబనిరి ♦ కోరికఁదీర్పఁ జెంతఁ జేరితిన్॥

బుద్ధి—రాజా! తమరు నన్నింతగఁ బ్రాధేయ పడుటేల? తమ యాజ్ఞలకే బద్ధుండ గానా?

సుద—పితృసమానా! నా మనవిని వినుఁడు. అజ్ఞానినై చపలచిత్తంబున నేనొనర్చిన లోపంబులన్నిటి మఱచి పూర్వపు బుద్ధిసాగరులై రాజ్యపాలనమును మీ కరమున వహింపుఁడు. నా భారము దించి మోదావహులఁ జేయుఁడు. మా తండ్రి తమచేతుల నప్పడిపోయిన మాట మఱువకుఁడు.

బుద్ధి—నాయనా! మీపూర్వులయెడ నాకుంగల భక్తివిశ్వాసంబులును నీయందలి కుమారవాత్సల్యంబును నీచర్యలెట్టివైనను నన్నాగ్రహోపేతుం జేయవు. మనకిరువురకి భావభేదములు లేవు. కాని రాజనీతిం బరికింపవలయు. ప్రజాభిప్రాయంబునకు వెఱచి నన్నాదరించినట్లుండరాదు. అట్లైన మంత్రిగౌరవభంగమును, ప్రజాశక్తికి నాధిక్యమును గూర్చిన వారమగుదుము. అది స్వయంకృతాపరాధమగు. అంతరంగికాభిప్రాయ మెట్లుండినను నటనఁజూపవలెను.

సుద—తమచిత్తమువచ్చినరీతి నాచరింపుఁడు. పూర్ణాధికారము నిచ్చుచున్నాను

బుద్ధి—దమను నిచటికిఁ బిలిపించుఁడు. నవాబునకు, బుద్ధిసాగరుని విమ యమై పునర్విచారణ జరుపబడునుగాన విచ్చేయుఁడని కబురంపుడు.

సుద—సేవకా! కారాగృహాధికారి వద్దనుండి కాగితమును గలమును సిరాబుడ్డియుం దెమ్ము.

సేవ—చిత్తము మహాప్రభూ!

సుద—(సేవకు డందిచ్చిన వానిం గొని వ్రాసి) సేవకా! నీ విద్దానిఁ గొని తీవ్రజవంబున నవాబుగారి దేవిడీకేగి వారి కీయుత్తర మందఁజేసి రమ్ము.

సేవకుఁడు—(అందుకొని) మహాప్రసాదమట్లే యొనర్చెదను.

బుద్ధి—(తలవంచుకొనియుండును.)

సుద—(స్వగతము) మత్కృతాపరాధ మీతని తో ముచ్చటించుటకు మనసొప్పకున్నది. ఆహా! ఏమి యీతని శాంతగుణము! అనిమిత్త కారణంబున నలజడిం గూర్చిన నన్నొక్క పరుషోక్తి నేని నాడఁడు. ఔను; సత్పురుషుల లక్షణము లిట్టులే యుండును. ఎదిరికి గుణపాఠం బుల నిట్లే నేర్పుదురు. ఈతని ప్రేమపుంజాడ్యులును నిష్కల్మష హృదయంబును నాకతినమనమునఁ బశ్చాత్తాపంబు నంకురింపఁజేసి నాలోపంబుల దీపించుచు మూర్ఖంబు నెత్తనీకున్నది.

బుద్ధి—రాజా! నీచే నొక్కనాడి పాపకూపంబునం బడితి. ప్రమత్తా వస్థయందు ప్రమాదము సంఘటించె.

సుద—(స్వగతము) వచ్చినపామును జంపువిధమిద్దియే. (బహిరంగ ముగా) మహాత్మా! నా మొక్క సహిత మఘకారణమయ్యెగా? నేనెంతటి కట్టడినైతిని! అనంతంబులగు నాదోషపుంజంబుల పరి హారంబులగుడు "నిండమునిఁగినవానికిఁ జలియేమి" అన్నట్లుండుల కై నాకే చింతయులేదుగాని నాయన ర్థతకుఁ జింతించుచుంటి.

బుద్ధి—రాజా! మీరు ప్రభువులు; నేను సేవకుఁడను. ఆయుద్దేశమున నే నట్లంటి. విపరీతార్థములకు స్థానమొసంగకుఁడు.

సేవకుఁడు—(తెచ్చిలో) స్వామీ! నవాబుగారును శశిభూషణుఁడు గారును దర్శన మపేక్షించుచున్నారు.

సుద—సేవకా! వారినింగోఁ జేర్చుచు గారాగృహాధికారితోఁ దమనుని గూడ నానమతిమునకుఁ జేర్చుమనుము.

(ఒకపార్శ్వమునుండి నవాబును శశిభూషణుఁడును వేఱొకపార్శ్వమునుండి సంకెలలతో దమనుండును ప్రవేశింతురు)

నవాబు సాహెబ్జీ! శశిభూషణార్యా! అర్ఘ్యాసనముల నాసీనులుగండు. శశిభూషణార్యా! తమరెపుడు దయచేసితిరి?

శశి—రాజా! కార్యాంతరమునచే నేనిందే యున్నాఁడను.

సుద—దమనాఖ్యా! బుద్ధిసాగరుకడఁ జేరంబోకుము.

నవా—[బుద్ధిసాగరుం జూపుచు] మహాత్మాజీ బోరామే మాకీయర్ఘ్యాసన్నంమే. [అని నేలం గూరుచుండును.] శశిభూషణుఁ డట్లె యొనర్చును. దమనుఁడు బుద్ధిసాగరుఁజేరం బోవును]

సుద—సాహెబ్ మన్నించు! బుద్ధిసాగరుఁడు గొప్పవాఁడు. మా కుటుంబము వారికి మేలు నహాయంబుగ నొనర్చినవాఁడు. ఇందేదియును నేను గాదనను. అనవసరంబుగఁ జెట్టుకొట్టి పైనవేసికొనెను. వానికై కన్య నన్వేషింపఁ దనకున్నై తాను ముందంజవైచి సురూపందెచ్చి కుమారునికిం గూర్చెను. ఇది యాతనిదోషము.

సాహె—అజీ! సర్కార్! బుద్ధిసాగర్ కారణం అన్నమాట జూటా. అజీ! దమన్ భాయి! అబ్ సచ్చీచ్ బోలో. మాకీ చెప్పాలా. నీకీ చెప్తుందిబోలో.

దమ—రాజశేఖరా! బుద్ధిసాగరుఁడు కన్యాంగనే నెగడించి మదనునకు రేపెట్టిన దుర్మతిని నేనే. అంతటం బోక బుద్ధిసాగరునకు శృంగభంగమును గూర్ప నాయపకృతుమని నీచుండనై యీ మాననీయుండగు మహమ్మదీయప్రభువునే లజ్జవీడి వేఁడితిని. చిత్రరేఖ పురుషుఁడుగ నెట్లు మాఱెనో ఆవిషయము నా కగమ్యముగ నున్నది. ఈసందర్భమున నే నేకుట్ర నొనర్పలేదు. చిత్రరేఖ నాతో నేల బుద్ధిసాగరునిఁ గూర్చియు మదనునిఁ గూర్చియు వెగటుగ మాటాడెనో యూహింపఁ జాలకున్నాను. ఈశశిభూషణ మహాశయుఁడు నిజము దాఁపక నిశ్చితాంశంబుల వివరించిన మేలొనగూర్చినవాఁడగు.

శశిభూ—నృపాల వతంసమా! నావారినిం గాపాడను దుర్బుద్ధుల మాయలు ప్రబలకుండుటకును, కొంత చోరవం గలిగించుకొని నేనును గొన్ని యనృతము లాడవలసివచ్చె. అందులకు మన్నింపుఁడు. నేను బురుషుఁడను గాను. చిత్రరేఖ చెల్లెలను శశిరేఖ యను నామముదాన. మదన చిత్రరేఖలు కాననంబులకుఁ జేర్పంబడిన ట్లీ ముసలమాను నవాబుగారి మహాలమున వింటి. చాలదినములను డియు నేను పురుష వేసమునసే తిరుగుచున్నాను. నవాబుగారి మహాలమున నే చేయఁగల సాహాయ్యమెంచి పురుష వేషమున నీ దమనుని వెన్నాడి, మదన చిత్రరేఖలంగని, వారికి, దమనుఁడు వారిం బందీకృతుఁ లొనర్చి గొంపోవ నాకుఁ బ్రవేశించిన వృత్తాంతము విశదపఱచి, వారల సాగనంపి నేనే చిత్రరేఖనై తిరుగాడుచుంటి. దమనుఁడు నన్నే చిత్రరేఖయనకొని ప్రశ్నించె. అతఁడు నమ్మున ట్లన్నియుఁ బలికి నమ్మించితి. పల్లకిఁ జూపి ప్రవేశింపుమని పాప మాతఁడు బోయులతో రానేగ. నేనీలో నా పురుష వేషమున నందుఁ జేరితి. పై విషయము శ్రీవారికి విశదము. కార్యార్థినై నే నాడిన మృషలకు నటించిన కార్యలకు ప్రభువు లాగ్రహపడకుండురు గాత.

దమ—రాజా! ఏదెట్లున్నను ఆరంభమునుండియు నన్ను దకృత్యంబులనంతంబులు. బుద్ధిసాగరునిపై యారోపింపఁబడిన నేరంబులకు మూలము నేననఁజెల్లు. అతఁడు నిర్దోషి.

బుద్ధి—దమనార్యా! అదేటిమాట? నరేశు నబలయుతు న్నొనర్పంగ శపథమూని సిగ్గింపఁ గల్గితినే?

నవాబు — ఈనొగార్ మదన్‌కీ యిస్కా చెప్పటం అసల్ మూలం నైతో మదన్ చిత్రకీ సూడటం కైసా. ఆజీ! సర్కార్! మాకీ మాట పరాను చెప్పార్ లేదూ.

సుద—నవాబా! నీనుడులు యథార్థములు.

సుద—మంత్రులారా!

తే॥ గీ॥ కలుగు నధికారబలమునఁ ♦ గనులమూసి
గాసి మిముఁబెట్టఁ బరమాత్మ ♦ కనులుఁదెఱువ
నొత్తిడీసిఁదెచ్చెఁ బ్రజల ♦ నోరెత్తనిచ్చి
జనులచే నీతులంకున ♦ జ్ఞానినైతి
చెఱయె మెఱుఁగవమాన దు ♦ స్థితులకన్న॥

తే॥ గీ॥ మువ్వురియందున లోపము ♦ ల్దవిలియుంటఁ
జేకురంజేసెఁ దలవంపు ♦ శేషశాయి
యాగ్రహాన్మత్తతఁ బడినే ♦ నాచరించి
నట్టి కృత్యములన్మఱవఁగా ♦ నోను మీకు॥

తే॥ గీ॥ దమన! యిచ్చితి మరలఁ బ్ర ♦ ధానపదవి
నెఱిఁగి భవదీయలోపము ♦ లెక్కవనుచు
నొచ్చుకొనుచుంట వదలఁగ ♦ నిచ్చలేక
ముందు జాగ్రత్తవహియించి ♦ యుందుగాక॥

మీరిప్పుడును జెఱనుండి విముక్తులైతిరి. తేపు తమరాస్థానమున మంత్రిస్థానము నలంకరింపఁదగు. సేవకా! కారాగృహాధికారిం బిల్వుము.

సేవకుఁడు—చిత్తము.

బుద్ధి—ఆహా ఏమి నీ పశ్చాత్తాపము!

ఉ॥ నీ సములేరి పృథ్వీధర ♦ శ్రీపతి సద్గుణ రాజచంద్రమా?
చేసినలోపము ల్దలఁపు ♦ చేకురుశో కఱవద్ది యబ్బినన్
వాసిదొలంగు, గౌరవపు ♦ భంగముకూర్చుఁ బ్రతిష్ఠతగ్గుఁజేఁ
జేసిన మార్పులంచుఁ బ్రభు ♦ చిత్తము తత్తరమందుచుండుఁగా॥

[కారాగృహాధికారి ప్రవేశించును]

సుద—ఓయీ! వీరి నీక్షణముననే విడిపించి వారిగృహంబులకు శకటారూఢులం జేసి పంపుము. నీవు వెళ్ళుము.

కారా—చిత్తము.

నవాబు—అజీ! రాజాసర్కార్! మేరా ఆత్మ ఆనందహోగయా,

బుద్ధి—రాజా! దమనుని యాత్మంజొచ్చి దైవముప్రేరేపించి దమవడ కటి గదింజేర్చిన శశిభూషణుం డను వ్యవహార నామము వహించిన యీపూర్ణశశి నేని హసించు ముఖారవిందమున నొప్పు శశిరేఖను దమరుపాణిగ్రహణ మొనర్పుట యుత్తమమని తోంచెడి. శశి భూషణా! నిన్నిక నేను శశిరేఖాయని యనియెదను.

శశిభూ—(తలవంచుకొని మారాడక పురుషుల దుస్తులన్ని విడిచి స్త్రీరూపమునం బ్రత్యక్షము గాం బ్రయత్నించుచుండు)

బుద్ధి—నాకోడలి చెల్లెలివగుటచే స్వతంత్రత వహించి మారాజును నీవు వరియింప వలచెదవా యని ప్రశ్నింతునా?

నవాబు—బుద్ధిసాగర్ భయ్యా! దుస్రాభాశ్ నైనా పైయన్నమాట కావా.

సుద—(నవ్వుచు) మంత్రిసత్తమా! కడుంగడుజాణవోలె నిదర్శనపూర్వ కంబుగం జర్యలగుపడుచుండ నీయమాయకుడేరీతి వరింప నర్హుడు.

శశి—మామగారి యాజ్ఞలకు నేనుబద్ధురాలను. నిజే.........నరేశుని పల్కుల కాదినే విజ్ఞప్తి నర్పించు కొంటిని.

బుద్ధి—దైవదత్తంబగు కన్యకామణియే రాణి యగుగాంత.

[సేవకుండు ప్రవేశించును]

సేవకు—స్వాములారా! ఇవిగో! తమకు వస్త్రములు. [శృంఖలందీయును]

[బుద్ధిసాగరదమనులు వస్త్రధారులై ముందునకు వత్తురు]

బుద్ధి—[రాజుకరమును శశిరేఖకరమును చేర్చిపట్టి]

తే॥ గీ॥ ఒండొరులమెడం దీరని ♦ మెండుప్రేమ
కలిగిన కలిమికినిం దోడు ♦ కడుపుఫలము
సంతతానందమును ధర్మ ♦ సత్యసిగతి
పేడుగడయందు న తిథుల ♦ యెడలభక్తి
దంపతులకిడుతం బురాణ ♦ దంపతులును॥

తే॥ గీ॥ రాణినింగూడు భాగ్యమిా ♦ రాజవరున
కీముహూర్తమందున విధి ♦ యేరుపఱుప

మనుజయత్నము లేపాటి ♦ యనువుపడును
దైవసంకల్పమునుగూడఁ ♦ దారసిలక॥

[నవాబును కౌఁగలించుకొని]

తే॥ గీ॥ బాల్యమైత్రి నెంచి చెలిను ♦ వదలఁజేయు
జాతిభేదము లెంచుట ♦ నీతి కాద
టంచు బోధించి జనులలో ♦ నైకమత్య
మమరిచి విభులఁగ అపుడే ♦ మహిమఁదెలుపు॥

శశిరేఖ—నాయిప్పటి యుచ్ఛస్థితికి నిలువెడలఁ దరిమిన సవతితల్లియు తరువాత బుద్ధిసాగర బుధేంద్రునిమూలమున దుష్టులబారినుండి తప్పింపఁబడి సుఖులు జేర్పంబడిన మదీయసోదరియు, పిమ్మట సోదరినైయుండఁజేరి నెమకునెడ దర్శనప్రాప్తినొసఁగి గౌరవించి కర్తవ్యముం దెలిపి సాయమొనర్చిన నవాబును, తదనంతరము శ్రీవారిందర్శింపఁ గారణుఁడైన దమనాఖ్యుండునుఁ, దుదకుఁ ప్రాణనాయకుం గూర్చిన బుద్ధిసాగరాఖ్యుం బరఁగు మామగారును ముఖ్యులు. మఱచితిని; మా బావగారు పై ముఖ్యులలో నగ్రస్థాన మలంకరింపఁదగిన వారు. వారు మా చిత్రరేఖం గ్రహింపకున్న నింతింతల కవకాశము లుండియుండవు.

మద—మంత్రులారా! సాహెబ్ వారు! కోలాహాలమెద్ది?

సేవకు—[తెరలో] రాజేంద్రా! జనులు తండోపతండంబులుగ మూఁగి వచ్చుచున్నారు. రామశర్మగారును, తల్లియు, నిల్లాలును దోడరా మదనాఖ్యుండును ద్వారముకడ విచ్చేసి యిటఁజేరం గాంక్షించుచున్నారు.

(పైవారు ప్రవేశింతురు)

బుద్ధిసాగరుని యిల్లాలును, మదనుండును, చిత్రరేఖయు, బుద్ధిసాగరునికి సాష్టాంగ నమస్కార మొనర్చి లేచి నిలచియుందురు)

బుద్ధి— రామశర్మా! నమస్కారములు. మీరు నాయెడఁగల యనురాగము వెల్లడించి ధన్యులొనర్చితిరి. కుమారా! ఏల తల వంచి యున్నావు? నీమూలమున నిట్లయ్యెనని వగవకు. అంతయును

కాలగతి. చిత్రరేఖా! చెల్లెలు చేరఁగా లేదని చుఱచుఱఁ జూడకు. రాజు కరమంది రాణియయ్యె.

సుద — మంత్రిసుతా! మదనా! బాల్య మిత్రత్వమును బాటింపక నే నెగ్గుఁ గూర్చితి. మన్నింపుము.

మద — అయ్యో! అట్లు కాను. అగ్రతాంబూలమునకు నే నర్హుండను.

నవాబు — ఫిర్ షాబ్బీ బాతాం హైకుజీ. ఏకేకద్మీ మనుసుల్ మే హెంత హెంత బుద్ధుల్ ఉన్నాయి చూపించార్ అల్లావార్. అందర్ చల్లాగా ఉన్నాయి. ఈల్లాకి జనం నూట్టానికీ భార్ అయినా.

సుద — నవాబా! నీ వచనంబులు యథార్థములు. ఆలసించు టొప్పదు. పెక్కుర కాశాభంగము గలిగించుచున్నారము. రామశర్మా! భరతవాక్యమనుఁడు.

రామ —.

తే॥ గీ॥ కొఱంత లేకుండ జనులకుఁ ♦ గోరికలును
కార్యదీక్షయు సత్పథ ♦ కామితమును
ప్రజలభావమ్మునకుఁ దగు ♦ పాలనమును
శ్రీపతి యనుగ్రహించి ♦ రక్షించుఁగాత॥

అందఱు — తథాస్తు. తథాస్తు.

(అందఱు వెడలిపోవుదురు.)

[తెర వ్రాలును.]

---

సమాప్తము.

---

# వేంకటరమణ గ్రంథమాల.

పల్లె వేంకట సుబ్బారాయ కృత గ్రంథములు.

| | | | |
|---|---|---|---|
| 1 సుదర్శనాబాయి (నవల) | (Approved) | రు | 0-12-0 |
| 2 గంగాబాయి (చారిత్రాత్మకమగు నవల) | డిటో | ,, | 0-12-0 |
| 3 స్త్రీభారతము (వచనము) | డిటో | ,, | 0-12-0 |
| 4 దుర్యోధన పరాభవము (నాటకము) | | ,, | 0-10-0 |
| (Approved for Libraries) | | | |
| 5 త్రిభువనము (నవల) | | | అచ్చులోనున్నది. |
| 6 హనుమద్విజయము (వచనము) | | | డిటో |

మయిలవరపు వేంకటరామయ్య కృత గ్రంథములు.

| | | |
|---|---|---|
| 1 పౌరుషలీల (పద్యకావ్యము) | రు | 0-6-0 |
| 2 భజగోవింద శ్లోకములు, వీనికి సరియగు తేటగీత పద్యములు. | ,, | 0-1-0 |
| (3) Practical Geometry in Telugu Part I (Approved) | ,, | 0-8-0 |

# ఇతర గ్రంథములు.

| | | |
|---|---|---|
| 1 కళాపూర్ణోదయము (మంచి అచ్చు) | రు | 1-0-0 |
| 2 లలనాశతకము (వింజమూరి సుబ్బారాయ కృతము) | ,, | 0-2-0 |
| 3 అప్పయాంక మహాపురుషులు | ,, | 0-1-6 |
| 4 పతివ్రత | ,, | 0-3-0 |
| 5 యుధిష్ఠిరచక్రవర్తి (వచనము) (Approved) (శ్రీమతి దేశిరాజు లక్ష్మీనరసమాంబా విరచితము) | ,, | 0-6-0 |

# రోషనార.

కొప్పరపు సుబ్బారాయ విరచితము.

క్రొత్తకూర్పు. అతిముఖ్యములగు సవరణలు. అత్యద్భుతములగు కీర్తనలు. ఆంధ్రదేశమునందలి ప్రసిద్ధ రాజమునందును ప్రదర్శింపఁబడి మెప్పుగాంచినది. పెక్కు పత్రికలచే, పండితులచే, నటులచే కీర్తింపఁబడినది. "These scenes of Roshanara have few parallels and certainly no superiors in the field of Telugu Historical Drama" అని స్వరాజ్యపత్రికచే ప్రశంసింపఁబడినది. వెల రు 1-4-0. [illegible]. వలయువారు గుంటూరు, కొత్తపేటయందున్న గ్రంథకర్తకు వ్రాయవలయును.

---

# కాశీవిజయము.

వెల : రు 0-10-0

పదంకముల క్రొత్తనాటకము - చరిత్రాత్మకము
సుసర్ల రామమూర్తి విరచితము.

Apply to:—

P. V. RAMANAIYA & Son,
Opticians, Booksellers, Publishers, etc.,
GUNTUR.